# కరిమింగిన వెలగపండు

[ న వ ల ]

రా వూ రి భ ర ద్వా జ



ఆదర్శ గ్రంథమండలి
విజయవాడ-2

ఆదర్శ ప్రచురణ :
ద్వితీయ ముద్రణ.
సెప్టెంబరు. 1967.

వెల రు. 2-75

ముద్రణ :
పరమేశ్వరీ ప్రెస్,
విజయవాడ - 2.

# కరిమింగిన వెలగపండు

(కృష్ణాపత్రికలో ధారావాహికంగా ప్రచురింపబడిన నవల)

5

ప్రియమైన భరద్వాజగారికి,

ఆదరంతో మీరు పంపిన 'కరిమింగిన వెలగపండు' చదివాను. చదువుతున్నంతసేపూ, మనస్సంతా వుద్వేగంతో నిండిపోయింది. ఆఖరుపేజీ తిప్పేశాక, ఓ కొత్తప్రపంచం లోనికి అడుగుపెట్టిన అనుభూతికి లోనయ్యాను. జీవితానికి ఓ సరికొత్త నిర్వచనం లభించినట్లనిపించింది!

"ఎలా వుంది?"

అని మీరడిగినప్పుడు, చప్పున సమాధానం చెప్పలేక పోయాను. 'ఉన్నతమైన కళను మౌనంద్వారానే అనుభవించగలం' మన్న ఆస్కార్ వైల్డ్ మాట, నాకాసమయంలో జ్ఞప్తికొచ్చింది. అప్పటికీ, ఇప్పటికీ, అంతకు మించిన సమాధానమేదీ నాకు స్ఫురించలేదు.

ఇరవయ్యేళ్లుగా, మీరేం వ్రాస్తున్నారోనని, ఆత్రంగా అన్వేషించే వారిలో నేనూ వొకణ్ని. మీరచనల్లో వచ్చిన ప్రతిమార్పునూ, నేను అవగాహన చేసుకొన్నాను; చేసుకొంటున్నాను.

మానవునిపట్ల, జీవితంపట్ల, మీకుగల అభిప్రాయాలతో నా కెప్పుడూ పేచీలేదు. వాటిని అభివ్యక్తీకరించడంలో, మీరెన్నుకున్న మార్గం, అవలంబించిన శిల్పం; అదీ _ నన్ను ముగ్ధుణ్ని చేసింది!

‘కరిమింగిన వెలగపండు’ లో మీరు చేసిన ఇంద్రజాలం అత్యద్భుతమైనది. పొగలూ, సెగలూ విరజిమ్ముతూనే; మాటలను చాకులూ, బాకులూ చేసి విసురుతూనే; ఆ గాయాల బాధకూ గిలగిలలాడిపోకుండా, కులాసాగా నవ్వుకోగలిగేట్లు చేయడం — నవ్వుకొని, యేకాంతంలో లోలోపలి వికృతాలకు సిగ్గుపడేట్లు చేయడంలో—; మీరు ప్రదర్శించిన నైపుణ్యం అనన్యమైనది!

జీవితంలోంచి — హాయి, ఆనందం, తప్పుకొన్నాయి. అందుకు భౌతికమైన కారణాలు ఎన్నివున్నా, అంతకుమించినవేవోకూడా, కొన్ని వుండాలనుకొనేవాణ్ణి. ఆ ‘ఏవో’ ‘ఏమిటో’ యీ పుస్తకం నాకు విప్పిచెప్పింది.

కవిరాజ సాహితీసదనం,
హైదరాబాదు—24,
11—6—1962.

— త్రిపురనేని సుబ్బారావు.

# కథ వెనుక కథ

చాలా రోజులనుంచీ వ్రాదామనుకుంటూనే అనేకానేక కారణాలవలన వాయిదా వేస్తూవచ్చినవాటిలో యీ "కరిమింగిన వెలగపండు" ఒకటి. శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజు గారు తొందరపెట్టకపోయినట్లయితే యీ రచన యిప్పటి కైనా వెలువడేది కాదనుకొంటాను.

శ్రీ తిమ్మరాజుగారిని గురించి – పూజ్యులు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, అయ్యదేవర కాళేశ్వరరావుగారు, త్రిపురనేని గోపీచంద్‌గారు నాతో చాలా చెప్పారు. పరిచయమయ్యాకగాని శ్రీ తిమ్మరాజుగారిని గురించి వీరందరూ యెందుకంతగా చెప్పిందీ నాకు బోధపడలేదు.

హైదరాబాదు వచ్చిన ప్రతిసారీ శ్రీ తిమ్మరాజుగారు కొత్త కథలకోసం నన్ను ఒత్తిడిచేయడం సాగించారు. నేనేదో ఓ కారణం చెప్పినా వారంగీకరించేవారు కాదు.

— ఫలానా రోజుకు తిమ్మరాజుగారు వస్తున్నారంటూ మిత్రులు త్రిపురనేని సుబ్బారావుగారు కబురుచేశారు. ఈ దఫా వారికి నేను తప్పకుండా కొత్త కథ వినిపించాలి. అలాగని నేను వారికి చెప్పాను కూడాను. ఆ రోజునే కూచుని "కరిమింగిన వెలగపండు" ప్రారంభించాను.

—అలా త్వరపెట్టి యీ రచన వెలువడటానికి ముఖ్య కారకులైన శ్రీ తిమ్మరాజుగారికి కృతజ్ఞతగా దీనినే వారికి "కానుక" గా యిస్తున్నాను.

చదివి "లేఖ" వ్రాసిన శ్రీ త్రిపురనేని సుబ్బారావు గారికి, తొలిసారిగా తమ "కృష్ణాపత్రిక" లో ప్రకటించిన శ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్య శర్మగారికి నా అభివందనాలు.

'పద్మాలయ',
హైదరాబాదు_28.

—రావూరి భరద్వాజ.

# కరిమింగిన వెలగపండు.

## ౧ సవం

ప్రమాదపు దీపం కాంతిలో సత్యం అనుకొన్నది, సూర్యకాంతిలో అసత్యంగా మారిపోతుందని, సత్యవతి చదివినప్పుడు, ఆవిడకు బొత్తిగా నమ్మబుద్ధికాలేదు. అట్టే అనుభవం లేనివాడెవడో ఆ మాటలు రాసివుంటాడని సత్యవతి సులభంగా నమ్మేసింది. అంతేకాదు, ఇటువంటి చౌకబారు పుస్తకాలు చదవడంవల్ల వ్యక్తిత్వం వక్రమార్గాలు పడుతుందనీ, ప్రభుత్వంవారు యిటువంటి పుస్తకాలను నిషేధించడం చాలా అవసరమనీ కూడా సత్యవతి అనుకొన్నది. తన స్నేహితులతో యీ విషయము చాలా సార్లు వాదించింది కూడాను.

కానీ, యీనాడు ఆ మాటల్లో యెంతో సత్యం వున్నట్లుగా సత్యవతికి తోచసాగింది. ఆ రోజున తను అలా అనుకొన్నందుకూ, యితరులతో వాదించినందుకూ, సత్యవతి మనస్ఫూర్తిగా పశ్చాత్తాపపడింది కూడాను. అప్పటికీ, యిప్పటికీ మధ్య రమారమిగా అయిదేళ్లు దొర్లిపోయాయి. ఈ మధ్యకాలంలో జరుగవలసినవన్నీ జరిగాయి.

గడియారం టంగుమంటూ యెనిమిదిసార్లు మోగింది. సత్యవతి బద్ధకంగా ఓసారి ఆవలించి, వొళ్లు విరుచుకొని చిరాగ్గా వీధికేసి చూసింది. శంకరం వస్తున్న జాడలేమీ కానడంలేదు. అప్రయత్నంగా ఆవిడ కళ్లు నీటితో నిండి పోయాయి. వాటిని తుడుచుకోవాలన్న స్పృహ కూడా ఆవిడకు కలగలేదు. మనస్సంతా గిజాటుగావుంది. రంగు రంగుల బొమ్మలు కళ్లముందు మెదలి, ప్రక్కకు తొలగి పోతున్నాయి. ఆ బొమ్మలకేసి నిర్ఘాంతపోయి చూస్తున్న దావిడ. తన బ్రతుకిలా అవుతుందని ఆవిడేనాడూ అనుకోలేదు. కనీసం తన స్నేహితులలో యెవరికీ యిలాంటి ఆలోచనన్నా పోలేదు.

జీవితంపట్ల యిటువంటి నిర్లిప్తత ఆవిడలో ప్రవేశించి చాలా రోజులయింది. బ్రతుకులో 'రుచి' తప్పిపోయింది. కూర బావుండలేదని అందరకూ తెలుసు. కానీ ఎందుకు బావుండలేదో, ఏంచేస్తే బావుంటుందోమాత్రం యెవరికీ తెలీదు. లోపాలు కనిపెట్టటంవల్లనే పరిస్థితులు బాగుపడవు. వాటిని సరిదిద్దుకోవాలి. ఉన్నవాటిని సరిదిద్దుకొని, అటువంటి పొరబాట్లు మళ్ళీ జరుగకుండా చూసుకోవాలి. అయితే కొన్ని కొన్ని తప్పులు అనేకసార్లు చేయడానికి అవకాశం ఉంటుంది. ఇంకొన్ని రకాల తప్పులు చేయడానికయినా, చేయక పోవడానికయినా, ఒకేవొక్క అవకాశం ఉంటుంది. ఆ వొక్క అవకాశం దుర్వినియోగమయిందో — దాన్ని బాగుచేయడం బ్రహ్మదేవుని వల్లకూడా కాదు తను ఇటు

వంటి పొరబాటు చేశానని సత్యవతి నమ్మకం. అది నిజంగా పొరబాటో కాదో మనం చెప్పలేం!

"నే నా దిక్కుమాలిన సినిమాకు వెళ్ళకుండా వుండ వలసింది!" అనుకొన్నది సత్యవతి అనేకసార్లు.

ఎందుకంటే, ఆవిడకు శంకరం అక్కడే తటస్థపడ్డాడు. అప్పటికప్పుడే వారిద్దరూ వొకరినొకరు ప్రేమించేసుకొన్నా రనడం బొత్తిగా అబద్ధం. కానీ, ఆ పరిచయమే లేకపోతే, వారి జీవితాలు మరో రకంగా వుండేవేమో చెప్పలేం. ఇన్నిటికీ, వారిద్దరి బ్రతుకులూ యిలా కావాలని దేవుడు రాసివున్నప్పుడు, యింకోలా జరగడానికి అవకాశమేదీ?

— సత్యవతి నాన్న మద్రాసులో పేరుపొందిన లాయరు. కోర్టులో ఆయన వాదిస్తుంటే, జడ్జీలుకూడా హడ లెత్తిపోతూ వుండేవారట! సాధారణంగా ఆయన చేపట్టిన కేసు వోడిపోవడమంటూ జరగదట! బ్రమ్మిని తిమ్మిని, తిమ్మిని బ్రమ్మినిచేసి, విజయాన్ని పొందేవాడట! నాలుగైదు భాషలలో ఆయనకు ధారాళమైన ప్రవేశం వుంది. ఏ విష యంమీదనైనా గంటలకు గంటలు, ప్రసంగించగలిగిన దిట్ట! ఆవకాయ మొదలుకొని, అణువుబాంబుదాకా ఆయనకు కొట్టినపిండి. మళ్ళీ ఏదో గ్యాస్‌కొట్టటం కాదు. నిజంగానే, ఆ విషయాలన్నీ ఆయనకు క్షుణ్ణంగా తెలుసు. తెలిసిన విష యంమీద ఎంతగట్టిగా నిలబడేవాడో, తెలీసిదాన్ని గురించి, అంత చప్పగా జారిపోయేవాడు. అయితే యిది కేవలం ప్రైవేటు వ్యవహారానికి సంబంధించిన సూత్రం! వృత్తి

దగ్గర కొచ్చేసరికి యీ సూత్రం ఆయన్ను బంధించలేక పోయేది.

ప్రతిసంవత్సరం, ఆవకాయపచ్చడి పెట్టే తరుణంలో, ఆయన ఇంటిల్లిపాదికీ ఆవకాయమీద మహోపన్యాసిమిచ్చే వాడు.

"ఈ కాలంవారికి తిండిరుచి కూడా తెలీదర్రా" అంటూ ఆయన ప్రారంభించేవాడు.

"ఆవకాయ వేసుగోందుకు ఎలాంటి మామిడికాయలు తీసుకురావాలో తెలీదు. కాయనున్నగాఉండాలి. చూస్తుంటే నూనెలో తేలుతూ కనిపించాలి. ఓ చిన్న రెబ్బ నోట వేసు కొంటే, నాలిక తెగి కిందపడాలి. పులుపుర్రొడ్డుగా ఉండే కాయలే ఎన్నుకోవాలి. పీచు ఉండకూడదు. టెంకె చిన్న దిగా ఉండాలి. చవగ్గా వస్తున్నాయి గదాని, చిన్న కాయలు కొన్నామో, అంతకంతా లుగసానం పడ్డామన్నమాటే! కాయలు యెక్కువొస్తున్నాయన్న మాటేగానీ, ఆ మేరకు టెంకెల బరువుతగ్గుతుందని మీరనుకోరు. కొట్టువాడు మచ్చుచూపించే కాయ, మీకు లెక్కెట్టి యిచ్చేకాయలూ, వొకటో కాదో మీ రెప్పుడన్న చూశారా? వాడు, ఒక చేత మూడు, మరో చేత రెండుకాయలూ పుచ్చుకున్నాడో లేదో మీరు చూస్తారా? మాటల్లోపెట్టి, మీ కిష్టమైన కబుర్లు చెప్పి, వాడు కాయలు తక్కువిస్తాడు. నాసిరకంవి యిస్తాడు. శాంపిల్ కాయలకూ మీ కిచ్చేవాటికీ చస్తే పోలికుండదు. తీరా యింటికొచ్చి చూసుకొంటే అంతా లొల్లే! వాడిని అడిగేందుకే వీల్లేదు. గట్టిగా మాట్లాడితే

నువ్వసలు మాదగ్గర కొననేలేదు పొమ్మంటాడు. చానేమన్నా చెయ్యగలమా ?” అంటాడాయన.

ఈ రకమైన కబుర్లు వినడానికి ఇంటివారంతా అలవాటయిపోయారు. వారికి విసుగనిపించదు. ఒక్కోసారి యీ బాపతు ముచ్చట్లు లేకపోతే, వారికి ఉద్దురుడుచుకొన్నట్లుగా ఉండేదికూడాను. పరిసరాలను తనకు అనుకూలంగా మార్చుకోవడమే కాకుండ, వాటిమీద తన ప్రభావాన్ని చాలా ప్రబలంగా ప్రసరింపచేయగలగడం ఆయనకు చాలా సులువు.

ఆవకాయలో, గుంటూరు మిరపకాయల కారమే వాడాలనేవాడు సామర్లకోటనుంచి ప్రత్యేకంగా పప్పునూనె తెప్పించేవాడు. ఎత్తుకెత్తుగా వెల్లుల్లిరెబ్బలు వేయించేవాడు. కుంకుడు గింజలంత శెనగలు తెప్పించి, ఆవకాయలో ధార బోయించేవాడు.

“ఆవకాయలో మాగిన శనగ్గింజ, పంటికింద వుంటేనే తప్ప లేకపోతే, ఆవ కలుపుకొని లాభమేమిటోయ్ !” అంటాడాయన.

ఆయనకు భోజనంపట్ల ప్రీతి జాస్తి. కొంప లంటుకు పోతున్నా తృప్తిగా భోజనం చెయ్యందే విస్తరిమీంచి లేవడు.

“తగలడే కొంపలు ఎటుకూడీ తగలడుతున్నాయి. మధ్యలో ఈ దిక్కుమాలినగుంజాట నెందుకయ్యా ? అర్థాకలితో నువ్వు లేచిపోతే, తగలడే కొంపలు ఆరిపోతయ్యా ! లేనప్పుడు, అలా ఆరాటపడటంలో అర్థంలేదు” అనేవాడు.

రంగధామరావుగారిని గురించి చెప్పుకోవాలంటే యిలాంటి సంగతులు బోలెడన్ని వున్నాయి.

ఆయన ఏనాడూ రాజకీయాల్లో స్వయంగా పాల్గో లేదు. కానీ ఆయనకు తెలియని ప్రముఖ రాజకీయవాదు లెవ్వరూ లేరు. కాంగ్రెస్ ఉద్యమం ముమ్మరంగా సాగు తున్న రోజుల్లో, చాలామంది లాయర్లు, ప్రాక్టీసులు వదిలేసి, కాంగ్రెసులో చేరిపోయారు. ఆయనతోపాటు పనిచేస్తున్న వారు రంగధామరావునుకూడా కాంగ్రెసులో చేరమన్నారు. బలవంతపెట్టారు. ఆయనససేమిరా వొప్పుకోలేదు.

"అందరూ దేశ సేవకులయిపోతే వ్యవహారాలెలా నడుస్తాయర్రా! నాకు కాంగ్రెసంటే భక్తి లేదనుకొన్నవాళ్లు పురుగులు పడిపోతారు. డబ్బులేందే ఏ వుద్యమమూ సజీ వంగా నడిచి చావదు. అవసర మొచ్చినప్పుడల్లా నా దగ్గరకు రండి. నాకు తోచిందేదో యిస్తాను. మీకాకయినా తిండీ తిప్పలూ కావాలిగదా మరి ?" అన్నాడాయన

అన్ని పార్టీలవారికీ, ఆయన విరాళా లిచ్చాడు. అందరూ ఆయనతో సన్నిహితంగా వుండేవారు. ప్రతి పార్టీ వారికీ ఆయన తమవాడేనన్న భ్రమను కలిగించగలిగాడు. నిజానికి రంగధామరావు, ఏ పార్టీవాడో ఖచ్చితంగాచెప్పడం ఎవరివల్లా కాదు.

ఆయన బ్రతుకు కష్టాలతో ప్రారంభమయింది. వారాలు చేసుకొని చదివాడు. దిన పస్తులున్నాడు. వీధిలైట్ల కింద చదువుకొన్నాడు. రోడ్లమీద నిద్రపోయాడు. ఇవన్నీ

ఈనాటికీ ఆయన చెప్పుకొంటాడు. కొంతమంది ఛటుక్కున తమ గత జీవితం మరచిపోతారు. తా మొకప్పుడు దరిద్రం అనుభవించామని చెప్పుకోవడానికే సిగ్గుపడతారు. రంగ ధామరావుగారు దీనికి పూర్తిగా వ్యతిరేకులు. దరిద్రమనేదే లేకపోతే, తనింతవాణ్ణి కావడం అసంభవమని ఆయన విశ్వాసం.

"నేను చట్టులోనుండి మొలుచుకొచ్చిన మొక్క లాంటివాణ్ణి. నీటికోసం, నేను ప్రతిక్షణం గిజగిజలాడి పోయాను. ఎండ నన్ను మాడలగొట్టేది. వడగాలి నా సారా న్నంతా పీల్చేసుకొని, లాగి లెంపలు వాయించేది అయినా నేను చావలేదు. అపజయాన్ని ఒప్పుకోనూలేదు. అలానే, మెల్ల మెల్లగా ఎదుగుతూవచ్చాను. ఈరోజున చేవదేలాను" అంటాడాయన చాలా సన్నిహితులైనవారి దగ్గర.

"ఇలాంటి బ్రతుకు నాబిడ్డలు చూడకూడదు. అందుకే పువ్వుల్లో పెట్టి పెంచుతున్నాను. వారికి ఏ విషయంలోనూ లోపంరాకుండా చూస్తున్నాను. వారిని అదుపులో వుంచడం నాకు ఇష్టం గిట్టదు. వారేం చెయ్యదలచినా నేను కాదనను. చూదాం — వారెలా తయారవుతారో ?" అనేవాడాయన.

నిజంగా పిల్లల విషయాలలో రంగధామరావుగారు కల్పించిన వాతావరణం మరో తండ్రి కల్పించివుండడు. ఈ దోహదం పిల్లల జీవితాలమీద బ్రహ్మాండమైన ప్రభా వాన్ని చూపించింది.

సూర్యంచదువుపూర్తిచేస్తూనే, పెళ్ళిచేసుకొన్నాడు. ఆ పెళ్ళి ప్రేమపెళ్ళి. లలితను చేసుకోవడంపట్ల, తల్లి

సుముఖంగా లేదు. రంగధామరావుగారు, భార్యను గట్టిగా చీవాట్లు వేశాడు.

"ఆ పిల్ల నాకు నచ్చిందోయ్ భగవంతుడా అని వాడంటుంటే నువ్వు కాదంటావేమే! చేసుకొనేది వాడుగానీ నువ్వు కాదుగదా! ఇన్నేళ్ళొచ్చాక, ఇంతచదువు చదివాక, ఏ పిల్లను చేసుకోవాలోకూడా నీ కొడుక్కు తెలీదంటావా? ఇంత డబ్బుపోసి చదివించిన చదువంతా వృథాయేనా?" అన్నాడాయన.

"దానికీదీనికీ సాపత్యమేమిటండీ?" అన్నది భాగ్యమ్మ.

"ఆ మాటకొస్తే దేనికీ దేనికీకూడా సాపత్యముండదు. అంతా మనం చూడడంలో వుంటుంది. వాడి కేది సుఖమో, వాడికి తెలిసినంత స్పష్టంగా మరొకంటివాడికి తెలీదు. కర్మగాలి వాడనుకొన్నది సుఖంకాదు – ఫలితం వాడే అనుభవిస్తాడు. ఆనాడు నిన్నుగానీ, నన్నుగానీ, వాడు నెపపెట్టే అవకాశమే వుండదు" అన్నాడు రంగధామరావు.

"కుర్రసన్నాసి తెలీక ఏదో అన్నాడని మీరూ అలా అంటే ఎలా?" అన్న దావిడ.

"భూతద్దంలోంచి చూస్తే చీమకూడా భయంకరంగా ఉంటుంది. సమస్యను సమస్యగా చూడాలిగానీ, దాన్ని ఉబికించి చూడకు" అన్నాడు ఆయనగారు.

భాగ్యమ్మగారు యింకేమీ మాట్లాడలేదు. ఆమె మనస్సులో ఏమున్నదో తెలీదు. అయితే చూసినవారికి, ఈ పెళ్ళి భాగ్యమ్మగారికి ఇష్టంలేకుండానే జరిగిందమకోవడానికి ఎలాంటి ఆధారాలు లేవు. పెళ్ళి చాలా వైభవంగా జరిగి

పోయింది. లలిత, సత్యవతి చాలా చిత్రంగా అతుక్కు పోయారు.

లలితను చూస్తుంటే సత్యవతి మనస్సు పరిపరివిధాల పోయింది. లలిత యెంతమంచిదంటే _ ఆవిడకు చెప్పుకోవడానికి రహస్యాలంటూ యింకేమీ మిగల్లేదు.

"ఇలా అరవిడిచి మాట్లాడటం వల్ల చాలా యిబ్బందులుంటాయనుకొంటాను వదినా! ఈనాడున్నంత కలివిడిగా రేపు మనం వుండకపోవచ్చు. అప్పుడు నువ్వన్న మాటలను నేను బైటపెట్టే అవకాశం లేదంటావా?" అన్నది సత్యవతి, వదినకేసి పరిశీలనగా చూస్తూ.

ఈ దెబ్బతో లలిత దిమ్మతిరిగిపోతుందని సత్యవతి అనుకొంటే, ఆవిడ పూర్తిగా భ్రమ పడిందనే చెప్పాలి. లలిత స్పృహతప్పిపడిపోలేదు సరిగదా, సత్యవతికేసి ఒక్షణం రెప్ప వేయకుండా చూసి, ఆ తరవాత తాపీగా చిరునవ్వు నవ్వింది.

"అలా బైటపెట్టనని నువ్వనుకొంటున్నావా వదినా?" అని రెట్టించింది సత్యవతి.

"మనస్సులో మాట చెప్పకూడదని యింతకుముందే గదుటోయ్ వొదినా నువ్వన్నది? ఇంతలోనే ఆ మాట మరచిపోతా ననుకొన్నావా?" అన్నది లలిత తేలిగ్గా నవ్వుతూ.

"ఇంకెప్పుడో, ఎవరో, నాపట్ల కక్ష పెట్టుకుంటారని యిప్పణ్ణించే మనుషుల్ని పోగొట్టుకోవటం నాకు గిట్టదు. నా మట్టుకు నాకు మనుషులందరూ మంచివారుగా నేకనిపిస్తారు

నువ్వు నా నెత్తి అణిచిందాకా, మంచిదానివనేఅనుకొంటాను. అలా అనుకోవడమే ఆరోగ్యంకూడాను. దిక్కుమాలిన అను మానాలన్నీ ఊహించుకొని తల దిమ్మెక్కించుకోవటం నా వల్లకాదు."

లలితనుగురించి యేదోఓరకమైన బొమ్మను చిత్రించు కోవాలని సత్యవతి తాపత్రయం. కాని ఆవిడకు కావలసిన బొమ్మ – ఆవిడకు అర్థమయ్యే బొమ్మ దొరకలేదు. లలిత సంస్కారం తన సంస్కారంకన్న హెచ్చుస్థాయిలో వున్న దేమోనని సత్యవతి అనేకసార్లు అనుకొన్నది. ఆ భావం మనస్సులో మెదిలినప్పుడల్లా, హోరుగాలిలో నిలబడినట్టుగా ఫీలయ్యేది సత్యవతి. ఆ యింటి మొత్తంలో సుఖంగా లేని దల్లా తనొక్కతె! తనైనా యెందుకలా గిజాటుపడుతున్నదో తెలీదు. కారణం తెలుసుకుందామని సత్యవతి రాత్రులకు రాత్రులు ఆలోచిస్తూ కూర్చునేది. కానిఆవిడకు ఏదీ స్ఫురించేదికాదు. ఈ ఇంట్లో వున్నవారందరూ ఆవిడకు విచిత్రంగా కనిపించేవారు. ఎవరిజీవితం వారు విడివిడిగా జీవిస్తున్నారు. ఒకరి విషయాలలో మరొకరు జోక్యం చేసుకోరు. కానీ ఎదటి వారికోసం, ప్రతివారూ, తమను తాము త్యాగం చేసు కొంటున్నారు. ఇది బలవంతాన జరుగుతుందనుకోవడం అన్యాయం. చాలా సంతోషంగా వారా త్యాగాన్ని చేస్తున్నారు.

లలితను చేసుకోవడం తండ్రికి ఇష్టమో కాదో సత్యవతికి ఈనాటికీ తెలీదు. కానీ, ఎప్పుడో ఏమాటల సందర్భంలోనో, ఆయన ఓ చిన్న ముక్కను నోరు జారాడు.

"నా పిల్లలు నేను కావాలనుకొంటున్నట్లుగా పెరగడంలేదు. బలవంతపెడితే వాళ్ళు నన్ను కాదనరుగాని, అలా జేయడం నా కిష్టంలేదు. వాళ్ళిష్టపడుతున్న విధానం విడిచి, నేను అభిమానం తెచ్చిపెట్టుకొంటున్నాను" అన్నాడు రంగధామరావుగారు ఒకసారి పార్టీలతో మాట్లాడుతూ.

అదేదో పెళ్ళి సు పెళ్ళిళ్ళను గురించి అరగంట సేపు చర్చ జరిగిన తరువాత, ఆయనగారు దాన్నిలా ముగింపు చేశారు. ఈ మాటలన్నీ సత్యవతి విన్నది. అప్పటికి సూర్యం పెళ్ళి జరిగి ఆట్టేరోజులు కాలేదు. దాన్నిబట్టి యీ పెళ్ళికి నాన్నకూడా సుముఖంగా లేడని సత్యవతి భావించినది.

చిత్రమేమిటంటే, రంగధామరావుగారు అలా కనిపించేవారే కాదు. ఆయనగారే కోడల్ని ఆప్యాయంగా ఆహ్వానించాడు. భాగ్యమ్మగారు కూడా లలితను బిడ్డను చూసినట్లుగా చూస్తోంది. ఇష్టంలేని పిల్ల ఇంటి కోడలయినప్పుడు, అత్తగారెలా వుంటుందో సత్యవతి విన్నది. తన తల్లి అలా లేనందుకు సత్యవతికి చెప్పరానంత ఆశ్చర్యం వేస్తుండేది.

"వీళ్ళెవరూ నాకు అర్థంకాకుండా పోతున్నారు!" అని వాపోయిందావిడ.

వారి దాంపత్యాలు చూస్తుంటే ఆవిడకు సంతోషమూ, ఆశ్చర్యమూ కూడా కలుగుతుండేవి. వీరందరూ, ఆత్మవంచన చేసుకొంటున్నారేమో నన్న భ్రమకూడా అప్పుడప్పుడు తలెత్తుతూవుండేది.

తన తల్లి, తండ్రితో యే పేచీలు లేకుండా యిమిడి పోయింది. లలిత, సూర్యమన్నయ్యతో యిమిడిపోయింది. అందరూ అందరితోనూ కలసిపోతున్నారు. కానీ, తనే కలవలేకపోతున్నది.

ఓసారి అన్నయ్యా, వదినా యెందుకో కీచులాడు కొన్నారు. భార్యాభర్తలు పోట్లాడుకోవడాని గురించి వినడమే తప్ప, సత్యవతి స్వయంగా చూసియెరుగదు. ఈసారి చూసింది. లలిత అన్నం తినకుండా పడుకొంటుందనీ, అన్నయ్య చేయిచేసుకొంటాడనీ సత్యవతి అనుకొన్నది. అలానే జరిగినప్పుడు తనేం చెయ్యాలో కూడా ఆలోచించి సిద్ధంగా వుంది. లలిత చాలా మామూలుగా భోంచేసి వెళ్ళి పోయింది. అన్నయ్య రాత్రి పదిగంటలదాకా నాన్నతో మాట్లాడి గదిలోకి వెళ్ళిపోయాడు.

సత్యవతి వుండబట్టలేకపోయింది. ఆవిడ అనుకొన్న వేవీ జరగనందుకు కడుపు వుబ్బుగావుంది. తండ్రితో చెప్పిందాకా ఆవిడకా వుబ్బు తగ్గనే లేదు.

"విన్నాను తల్లీ! లలితే యిందాక చెప్పింది" అన్నాడు రంగధామరావుగారు.

"ఇంకేమన్నా గొడవలు జరుగుతాయనుకొన్నాను నాన్నా! భగవంతుని దయవల్ల యేమీ జరగలేదు" అన్నది సత్యవతి.

"జరిగితేమాత్ర మేం తల్లీ! మనిషన్నవాడికి కోపం రాకపోతే యెలా. కోపం రావలసిందే! అరుచుకోవలసిందే! ఆ పొంగు కాస్త తగ్గాక తిరిగి కలుసుకోవలసిందే! కోర్టులో

యిద్దరు లాయర్లూ, హోరాహోరీగా దెబ్బలాడుకొంటారు. బయట కొచ్చాక మామూలుగా అయిపోతారు. అలా వుండకపోతే, యే యిద్దరు లాయర్లూ తిరిగి ముఖాముఖాలు చూసుకొనే ప్రాప్తముండదు" అన్నాడాయన.

ఆ తెల్లవారి దాదాపుగా యిదే సమాధానం లలిత కూడా చెప్పింది.

"అలా అనకు వదినా! అసలు నువ్వూ, అన్నయ్యా యెందుకు అరుచుకొన్నారట?" అన్నది సత్యవతి.

"నా మనస్సులో మాట చెప్పడానికి భయంగా వుందోయ్! పుట్టిన్న రేపు నువ్వు బైట పెట్టావంటే — అలా బైట పెడతానని నువ్వేగా అన్నావు!" అన్నది లలిత నవ్వి.

సత్యవతి ముఖం యేమాత్రమో వాడిపోయివుండాలి. లలిత అమాంతం సత్యవతిని కావలించుకొని గంటుపడేలా బుగ్గ కొరికింది.

"చాలా రుచిగా వున్నాయోయ్ వదినా నీ బుగ్గలు! ఏ అదృష్టవంతు డొస్తాడో గాని!" అన్నది లలిత పెదవులు పమిటతో తుడుచుకుంటూ.

"అబ్బ!" అంటూ సత్యవతి కూడా బుగ్గను మునివ్రేళ్ళతో రుద్దుకొంది.

"కబుర్లలో పెట్టి అసలు విషయం దాచేస్తున్నావొదినా నువ్వూ. ఎందుకట అరచుకొంది?" అన్నది సత్యవతి మళ్ళీ.

"మరిచిపోయాను. రెండో బుగ్గ యింకా ఖాళీగానే వుందిగదూ?" అంటూ లలిత ముందుకు వంగింది

"ఇలా అయితే మా అన్నతో చెప్పేస్తాను" అన్నది సత్యవతి.

"నేనూ ఆయనదగ్గర నేర్చుకొన్న పాఠమే యిది! బుగ్గలు రుచిగావుంటాయని నాకుమాత్ర మేం తెలుసు?" అన్నది లలిత నవ్వి.

సత్యవతి కూడా పకాలుమని నవ్వేసింది.

"నవ్వడమంటే యేమిటో నీదగ్గరే నేర్చుకోవాలోయ్ వొదినా! రేపొచ్చే వాడెవడోగానీ, నీ నవ్వుచూసి..."

వాకిట్లో అడుగుల చప్పుడయింది. ఇద్దరూ అటు తిరి గారు సూర్యం మెట్లెక్కి వస్తున్నాడు. సత్యవతి కిందికి వచ్చేసింది. వచ్చాకగానీ, అసలు విషయం వదిన దాటేసి నట్లు ఆవిడకు జ్ఞాపకంరాలేదు. అదేదో తేల్చుకొందామని గబగబా పైకి వచ్చింది. గది తలుపులు వోరగా వేసి వున్నాయి. తలుపు సందులోనుండా లోపలికి చూసింది సత్యవతి. ఆవిడ వొళ్ళు జలదరించింది. సిగ్గుతో బుగ్గలు యెర్రపడ్డాయి. తనలో తనే నవ్వుకొని నిశ్శబ్దంగా కింది కొచ్చింది.

ఆ రాత్రి సత్యవతి సరిగ్గా నిద్రపోయిందనడానికి లేదు. తెల్లవారుఝామువరకూ పక్కమీద అటూ యిటూ పొర్లు తూనేవుంది. ఎప్పుడో రవ్వంత కునుకుపట్టింది ఆ కలత నిద్రలో శంకరం వచ్చి తనను ముద్దెట్టుకొన్నట్టు కలవచ్చింది. "నీ బుగ్గలు చాలా రుచిగావుంటాయి సత్యా!" అన్నాడు శంకరం. సత్యవతి యేమన్నదో ఆవిడకు జ్ఞాపకంలేదు.

లలిత అన్నట్టుగానే శంకరంకూ అన్నాడు. తను చాలా అద్భుతంగా నవ్వుతుందట. శంకరం ఆమాట అన్న రోజున, నిలువుటద్దంముందు నిలబడి సత్యవతి చాలాసార్లు నవ్వింది. అద్దంలో చూసుకొన్న తరవాతగానీ, తను బాగా నవ్వగలనని సత్యవతికికూడా తోచలేదు.

"ఇంకెవ్వరో నాకర్థం కావడంలేదని వాపోతున్నాను గానీ, నాకు నేనే అర్థం కావడంలేదు" అనుకొన్నది సత్యవతి చిన్నగా నిట్టూర్చి.

అయిదేళ్ళ తరవాత, శంకరాన్ని ప్రేమించడానికిగల కారణాలు చెప్పమంటే సత్యవతి చెప్పలేకపోవచ్చు కానీ, ఆ రోజుల్లో ఆవిడదగ్గర కారణాల తోరణాలు చాలా వుండేవి. శంకరం చదువుగానీ, చక్కదనంగానీ, మాటకారితనంగానీ, ఇంకొకరిలో వుండవని, ఆ రోజుల్లో సత్యవతి మనస్ఫూర్తిగా విశ్వసించింది శంకరం కూడా రమారమిగా యిలాంటి ధోరణిలోనే వుండేవాడు.

"మీ నాన్న, అమ్మ, అన్నయ్య మన వివాహానికి వొప్పుకోకపోతే, ఇలా ఆజన్మ బ్రహ్మచారిగా వుండిపోతాను గానీ, మరో స్త్రీని పెళ్ళాడను సత్యా!" అన్నాడు శంకరం ఒకసారి బీచివొడ్డున యిసకలో వెల్లకిలా పడుకొని.

ఆ మాటతో సత్యవతి శరీరం పులకరించింది. శంకరం మనిషి కాడనీ, దేవుడనీ ఆమెకు అనిపించింది. అప్రయత్నంగా సత్యవతి కళ్ళు నీటితో నిండిపోయాయి. శంకరం జుత్తులోకి వేళ్లు పోనిచ్చి సుతారంగా దువ్వింది. శంకరం ఆ వేళ్ళను

పుచ్చుకొని కళ్ళకద్దుకొన్నాడు. ముద్దు పెట్టుకొన్నాడు. సత్యవతి తనువుతాను పూర్తిగా మరచిపోయింది.

"నేను మాత్రం యింకెలా చెయ్యగలనా శంకరం ? నీతోపాటే నేనూ పెళ్ళనేదిలేకుండా వుండిపోతాను" అన్నది సత్యవతి.

సాధారణంగా ప్రేమవ్యవహారాలు అట్టేకాలం దాగి వావు తమ సంగతులు మరెవరికి తెలీవని అబ్బాయి, అమ్మాయి అనుకోవచ్చు. కళ్ళుమూసుకొని పాలుతాగే పిల్లుల వ్యవహారం లాంటిదిది.

సత్యవతి ఎవరో కుర్రాడితో 'చనువుగా వుంటోందనీ; అతనితో కలిసి సినిమాలకూ, పార్కులకూ, వెళుతోందనీ, ముందుగా రంగధామరావుగారికి తెలిసింది. ఆ తరవాత భాగ్యమ్మగారికి తెలిసింది. ఆఖర్న తెలుసుకొన్నవాడు సూర్యం ఆ మాటవిన్న మరుక్షణంలో సూర్యం ముఖం కోపంతోకందిపోయింది. వంటినిండా దిగచెమటలుపోశాయి. అదృష్టవశాత్తూ ఆ క్షణాన సత్యవతి యెదురుగా లేదుగానీ, వున్నట్లయితే, బూడిదయి వుండేది.

రంగధామరావు గారిలో యే సంచలనమూ లేదు. ఆయన రోజూ వున్నంత ప్రశాంతంగానూ వున్నాడు.

"అలా నిమ్మకు నీరెత్తినట్టు కూచుంటారేమండీ ?" అన్నది భాగ్యమ్మ, భర్తను కార్యోన్ముఖుణ్ణి చేయాలన్న సంకల్పంతో.

చదువుతున్న పుస్తకాన్ని చాలా తాపీగా మూసి, అంతకన్న తాపీగా భార్యకేసి తిరిగి, కళ్ళజోడును ఓసారి

కుచ్చెళ్ళ చెంగుతో తుడిచి తిరిగి పెట్టుకొని, ఓ చిన్నసవ్వు నవ్వాడు.

భాగ్యమ్మగారు యేమీ అనలేకపోయింది.

"నన్నేం చెయ్యమంటావోయ్?" అన్నాడాయన, సుతారంగా కాళ్ళాడిస్తూ.

"ఏదో ఒకటి చెయ్యాలిగానీ, అలా గోళ్లు గిల్లు కుంటూ కూచుంటే ఎలా?" అన్నదావిడ.

దాదాపు నాలుగైదు నిమిషాలపాటు రంగధామరావు గారేమీ మాట్లాడలేదు. ఆ తరవాత, మరో చిరునవ్వు పారేసి, సహజ ధోరణిలో ప్రారంభించాడు.

"నాకు మనుష్యుల్ని చూస్తుంటే నవ్వాలో, ఏడవాలో కూడా తెలీకుండావుంది. ఏదో ఒకటి చెయ్యాలన్న ఆలోచన రానివాడికి ఆ పని చేసే శక్తి వుంటుందో, వుండదో నువ్వా లోచించవు. ఎపుడే పని చెయ్యాలో నాకు తెలీదని నువ్వను కుంటే, యింతకాలం మనం చేసింది కాపరమే కాదనాలి. ఎందు కంటున్నానంటే—"

భాగ్యమ్మగారు సన్నగా నిట్టూర్చింది.

"వినే ఓపిక లేదనుకొంటాను ఇంకోసారి చెబుతాను" అన్నాడు రంగధామరావుగారు. భార్య మనస్సు నొచ్చు కొన్నదని ఆయనగారు పసికట్టారు. "అవును గానీ, శనగ పచ్చడి చేసిందానివి, అందులో చిన్నుల్లి వేసుకొంటావుటే యెక్కడైనా. ఇన్నేళ్ళొచ్చాక కూడా నీకు చెప్పాలా? మాంచి సారపప్పు యెన్నుకోవాలి. గడ్డలూ - బెడ్డలూ

లేకుండా బాగుచేయాలి. మిర్చిని కూడా దోరగా వేయించాలి. పప్పు సహాబడ మెదిగిం తరవాత వేయించిన మిర్చిని వేసి, దాంతో బాటే, చింతపండును వేయాలి. రెండు కరివేపాకు రెబ్బలు వేయడం మరచిపోయావా, పచ్చడి రుచి కాస్తా చచ్చి వూరుకొంటుంది. ఈసారి మరెప్పుడన్నా చేస్తే యీ సంగతుల్ని దృష్టిలో వుంచుకో. కూర హితవు లేకుండా అన్నం తినమంటే యెలా చెప్పు?"

భాగ్యమ్మగారు లోపలి కెళుతుంటే, లలిత యెదురు పడింది. అత్తగారిని యేదో అడగాలని లలిత వుద్దేశ్యం. అయితే భాగ్యమ్మగారి మనస్సు మనస్సులో లేదు. లలిత నోరు మెదపలేకపోయింది.

ఆ రాత్రి సూర్యం; భార్యను పిలిచి అమ్మ యేమనుకుంటోందని అడిగాడు.

"ఏమనుకోడానికయినా, యిదేమంత కానిపని గనక? మొన్న నే నేం చేశానో, యివ్వాళ మీ చెల్లెలు అదే చేస్తోంది. దీని కింత హడావుడి యెందుకో నాకు తెలీదు?" అన్నది లలిత.

"అదీ యిదీ ఒకటేనా? ఇక గౌరవం అగౌరవం అంటూ యేమీ వుండదంటావా యేమిటి?" అన్నాడు సూర్యం భార్య మాటలను పూర్తిగా తోసివేస్తూ.

లలిత ఓ క్షణకాలం సూర్యం కేసి చూసి, తనలో తనే నవ్వుకొంది.

"ఏమిటి?" అన్నాడు సూర్యం.

"నాకు ఓ అన్నఉంటే, మన పెళ్ళి జరిగివుండేది కాదేమోననుకుంటాను. ఇప్పుడు మీరు పడుతున్న గుంజాట నంతా వాడూ పడేవాడు. గౌరవమనీ, మర్యాదనీ, మట్టనీ, మశానమనీ. వాపోయివుండేవాడు. అదృష్టవశాత్తూ నాకా బెడద లేకుండాపోయింది" అన్నది లలిత.

సూర్యం నిజంగా ఉగ్రుడయిపోయాడు.

"అంటే మీస్థాయికి నేను తగినవాణ్ణి కాదంటావా?" అన్నాడు సూర్యం.

"అలా పెడలార్థం తీసుకుంటే, ఏమాట నుండైనా చెడర్థాన్ని పిండవచ్చు. నాకో అన్నఉంటే యేం జరిగివుండేదో నన్నాను. ఇందులో ఎక్కువ తక్కువల ప్రసక్తేదీ?" అన్నది లలిత.

"మరినువ్వన్న దేగా!" అన్నాడు సూర్యం చిరచిర లాడుతూ.

"మరి శంకరాన్ని చేసుకుంటానంటే మీ రొద్దనడం ఎందుకు చెప్పండి? అతడు మంచివాడోకాదో మీకు మాత్రం తెలుసా?" అన్నది లలిత.

సూర్యం నివ్వెరపోయాడు. సత్యవతితో చనువుగా వుంటున్నవాడిపేరు అతని కింతవరకూ తెలీదు లలితకు పేరు తెలిసిందంటే వరి నా వురదల్లిద్దరూ కూడబలుక్కొనే వుంటా రన్నమాట.

"ఇంతకాలం ఈసంగతి నాతో అనలేదేం లలితా?" అన్నాడు సూర్యం.

"ఎప్పటికైనా బైటపడేవిషయాన్ని నా నోటిమీదుగా చెప్పడ మెందుకని మానుకొన్నాను" అన్నది లలిత.

సూర్యం యింకేమీ మాట్లాడలేదు.

ఈ గొడవ యింట్లోజరుగుతున్న సమయాన సత్యవతి శంకరం గదిలో వుంది. ఆమె ముఖంనిండా చెమటలు కారి పోతున్నాయి. అద్దంముందుకూచుని, రేగిపోయిన జుట్టు, గోళ్ళతో సరిదిద్దుకొంది. చీరె మడతలు సరిగ్గా సర్దుకొంది. బుగ్గలను ఒకటికి రెండుసార్లు జేబుగుడ్డతో రుద్దుకొంది కింది పెదవిని ముందుకు సాచి, పరీక్షగా చూసుకొంది.

ఎక్కడా గంటు కనిపించలేదు.

"మరి వెడతాను!" అన్నది సత్యవతి.

శంకరం పలకలేదు. కన్నార్పకుండా ఆవిడకేసిచూసి, నిట్టూర్చాడు. సత్యవతి మనస్సు కరిగిపోయింది. దగ్గరగా వచ్చి, తడబడుతూ నిలిచిపోయింది. శంకరం ప్రాణాలన్నీ పెదవుల్లోకి తెచ్చుకొని, సత్యవతిని గట్టిగా ముద్దెట్టుకొని వదిలేశాడు. సత్యవతి కళ్ళు మూతలు పడిపోయాయి...

ఈ సంగతులన్నీ జ్ఞాపకంచేసుకొని పెళ్ళయిన కొత్త రోజుల్లో వాళ్ళు తెగనవ్వుకునేవారు.

"ఇదివరకు మనం కలిసి తిరిగితే చెడ్డవాళ్ళం, ఇప్పుడు తిరిగితే ఆదర్శ దంపతులం. పూలదండలుమార్చుకోవడంతో మనకి హక్కువచ్చింది" అన్నాడు శంకరం.

అడపాదడపా అతను విచిత్రమైన అభిప్రాయాలు ప్రకటిస్తూ వుండేవాడు.

"పెళ్ళికీ, వ్యభిచారానికీ మధ్యనువున్న మార్జిన్ చాలా చిన్నది. ఇప్పటి పెళ్ళిళ్ళల్లో నూటికి 99 పాళ్ళు వ్యభిచారమే వుంది" అనేవాడు శంకరం.

"జీవితంమీద ఎప్పటికప్పుడు ఆసక్తిని పెంచుకోవాలిగానీ, చంపుకోగూడదు. ఇదెలా వస్తోందో చెప్పటం నాకూ చేతకాదు. రుచిలేని కూర తినమంటే తినలేంగదా! రుచిలేని బ్రతుకు బ్రతకమంటే యెలా?" అనేవాడు శంకరం.

ఈ మాటలన్నీ సత్యవతికి అద్భుతంగా తోచేవి. అటువంటివాణ్ణి పెళ్ళాడ గలిగినందుకు తనను తానే యెన్నోసార్లు అభినందించుకొన్న దావిడ. తమ జీవితాల్లో ప్రతినిత్యం ఆసక్తి తొణికిసలాడుతూ వుంటుందనీ, పుష్కలంగా రుచి వుంటుందనీ సత్యవతి విశ్వసించింది. అయిదేళ్ళన్నా నిండలేదు. ఆవిడ కలలన్నీ ఒక్కటొక్కటే విచ్చిపోసాగాయి. ఆ శిథిలాలకేసి చూస్తుంటే, ఆవిడ గుండె చెరువయిపోతోంది. ఎన్నోసార్లు వంటరిగా కూచుని, భోరుమని ఏడ్చేసింది సత్యవతి. భార్య మనస్సు సరిగా లేదని తెలిసికూడా శంకరం ఆమెను ఓదార్చేవాడు కాదు.

"నాకన్నా మీకు వుద్యోగమే ఎక్కువనుకొంటాను. అస్తమానూ అదే ధ్యాసయితే యెలా?" అన్నది సత్యవతి ఓసారి.

"ఎక్కువ తక్కువల గొడవ దేనిక్గానీ, ఈ వుద్యోగం చెయ్యడం నీ కిష్టంలేదా?" అన్నాడు శంకరం.

"నే నిష్టం లేదంటే మానేస్తారా?" అన్న దావిడ గొంతు కాస పెంచి.

"సరైన కారణాలు—నాకు నచ్చేవి—నువ్వు చెప్పాలే గానీ, క్షణంలో మానేస్తాను. నెలకు ఆరువందల సంపాదన చేదవుతుందని నువ్వుమాత్రం మెలా అనుకుంటావమ్మా?" అన్నాడు శంకరం.

సత్యవతి యేదో అనబోయికూడా మానేసింది. అదేమిటో చెప్పమని శంకరం బలవంతపెట్టలేదు.

ఒక్కోసారి అతిచిన్న విషయందగ్గర వా రిద్దరూ కీచులాడుకొనేవారు. ఏ ఒక్కరు సరిపెట్టుకొన్నా చాలు. కానీ ఆ పనిమాత్రం చస్తే చేసేవారు కాదు. మాటమీద మాట పెంచుకొంటూ పోయేవారు. ఆఖర్న మాటపడ్డవారికి ఆ రోజల్లా మనశ్శాంతి వుండేదికాదు. శంకరం హోటల్లో భోంచేసేవాడు; సత్యవతి అన్నం మాని పడుకొనేది. ఆ సంగతి తెలిసి కూడా అతను "ఇదేమిటి" అనేవాడు కాదు. మామూలుగా ఆఫీసుకు వెళ్ళిపోయేవాడు.

శంకరం అన్నట్టుగా వారికి జీవితాల్లో రుచి తప్పిపోయింది. ఈ సంగతి యిద్దరకూ తెలుసు. అయితే యేం చేయాలో మాత్రం వారికి తెలీదు.

సమయానికి జేబుగుడ్డ కనపడకపోయినా, పాంటు బొత్తాములు వూడిపోయినా శంకరం చాలా తీవ్రంగా అరిచేవాడు.

"కనీసం యిటువంటి పనులుకూడా నువ్వు చూసుకోలేవా? తీరా వెళ్ళబోయే సమయానికి యే ఒక్కటి సరిగ్గా లేకపోతే యెంత చిరాకో నీకు తెలీదు. నేనూ నిన్నలాగే చేస్తే నువేమయిపోతావ్?" అనేవాడు శంకరం.

"ఏమీ కాను. అంతకన్నా హాయిగా వుంటాను" అనేది సత్యవతి.

ఆఫీసులోని చిరాకులన్నీ తన నెత్తిన రుద్దుతున్నాడని సత్యవతి కంప్లెయింట్. సరిగ్గా శంకరం కూడా భార్యను గురించి యిలానే అనుకొనేవాడు.

"తామేదో విరగబడిపోతున్నామని ఆడవాళ్ళనుకోవడం వృత్తనాటకం లాగా కనిపిస్తోంది. మంచి మొగుడు దొరకాలేగానీ; యింట్లో కాలు బైట పెట్టాల్సిన అవసరం మాత్రం వారి కేదీ? నాలుగు మెతుకులు వుడకెయ్యడం, అంట్లు తోమడం, వెంకమ్మతో పుల్లమ్మతో కబుర్లు చెప్పడమేనా? ఇంకేమన్నా వున్నదా? ఆడవాళ్లు అధోగతిలో వున్నారో అని గోలకెత్తడంలో సబబులేదేమో ననిపిస్తోంది" అనుకొనే వాడు శంకరం.

ఒక్కోసారి తోటి వుద్యోగులతో కూడా యిదే మాట అంటుండేవాడు. ఆ మాట శంకరం అన్నప్పుడల్లా యింట్లో యేదో గొడవ జరిగివుంటుందని వారు నిర్ణయించుకునేవారు. శంకరం అన్నమాటలను ఆమోదించటం తప్ప, కాదనడం వా రెరుగరు. ఎందుకంటే, శంకరం చాలా మంచి వుద్యోగంలో వున్నాడు. పై అధికారుల ప్రాపకం అతనికి బాగా వుంది. అత నేమన్నా యెవ్వరూ కాదనరు. శంకరంతో పేచీ తెచ్చుకొని బావుకొనే దేమిటి గనక.

ఎంత చేసినా తరగని పని, ఏ ఆఫీసులోనైనా వుంటుంది. ఒక డ్రాయరునుండి మరో డ్రాయరుమీదికి కాగితం జరగ

డానికి అధమం నాలు గైదు రోజులుపడుతుంది. లాంఛనా లన్నీ పూర్తయి, కాగితం చేతి కొచ్చేనాటికి పుణ్యకాలం కాస్తా దాటిపోవచ్చు కూడాను. ఆ సెక్షనులో యేం జరిగినా బాధ్యత శంకరానిదే. అతని చేతికింద డజనుమంది మనుష్షు లున్నారు. వారందరూ అతనికి సహాయపడుతూవుండాలి. కానీ, అటువంటి దేమీ జరగడం లేదంటాడు శంకరం.

"మనుషులు యింత నీచులుగా మారిపోతా రెందుకో తెలీదు. పనెక్కువగా వుంటుందనుకొన్న రోజునే గుమా స్తాలు సి.యల్. కు ఎప్లయి చేస్తారు. శాంక్షను చెయ్యక పోవడానికి వీల్లేదు. చేస్తే పని కాదు ఎలా చచ్చేట్టు? మనుషులకు హక్కులు తెలిసినంత స్పష్టంగా బాధ్యతలు తెలీవు. ఈ మందతో వేగడం కష్టం!" అని చాలాసార్లు విసుక్కునేవాడు శంకరం.

ఆఫీసులోని చిరాకునూ, యింట్లోని మామూలు తనాన్నీ తప్పుకొందుకు అతని మనస్సు క్షోభించిపోయేది. అప్పుడప్పుడు క్లబ్బుకు వెడుతుండేవాడు. ఒక్కోసారి రెండేసి సినిమాలూ పిచ్చెత్తినవాడిలాగా చూసేవాడు. మరోసారి యే స్నేహితుని యింట్లోనో పడుకొనేవాడు.

" ఈ దిక్కుమాలిన వుద్యోగం మానెయ్యరా దుటోయ్ బాబూ! చిన్నమెత్తు సుఖంలేనప్పుడు, యెవరి కోసమట యీ పాకులాటంతా?" అని యే స్నేహితుడన్నా అన్నప్పుడు శంకరం నిస్సహాయంగా నవ్వేవాడు.

"మనిషి యెన్నింటికి బానిసత్వం చేస్తున్నాడో, మన బతుకులు చూస్తే తెలుస్తాయి. హోదాను వదలుకోలేం.

డబ్బును వదులుకోలేం. పదిమంది మనచుట్టూ తిరగాలన్న తపనను వదులుకోలేం. ఈ ఉద్యోగంలో వుంటే యివన్నీ దొరుకుతాయి. మానెయ్యమంటే యెలా ?" అనేవాడు శంకరం.

ఇంట్లోకూడా అతను క్షణం తీరికలేకుండా వుండేవాడు. ఉదయం నిద్రలేచేసరికే, పాతికమంది అతనికోసం కనిపెట్టుకొని వుండేవారు. వారందరితోనూ మాట్లాడితీరవలసిందే! ఒక్కొక్కరు చాలా గొప్పవాళ్ళ దగ్గరనుండి వుత్తరాలు తెస్తారు. ఇంకొంతమంది, ఫలానా మంత్రిగారికీ, తనకూ వున్న చుట్టరికాన్ని ముందుగా చెప్పి, ఆ తరవాత వచ్చిన పని చెప్పేవారు. చెయ్యడానికి చట్టం ఒప్పుకోకా, చెయ్యననడానికి వీల్లేకా శంకరం వుడ్డుకుడిచిపోయేవాడు. ఆదరాబాదరా రెండు మెతుకులు నోట గొట్టుకొని ఆఫీసు కెళ్ళేసరికి_ మామూలుపని వుండనేవుంటుంది. పనిచెయ్యలేదని గుమాస్తాలను అనేందుకుకూడా వీలుండదు. ఎంచాతంటే, వారిలో చాలామంది పెద్దవారి బంధువులు.

"ఎడ్మినిస్ట్రేషన్ పరమ ఛండాలంగా వుంది" అనేవాడు శంకరం చాలాసార్లు.

ఆఫీసు టైమయ్యాక, యెవరోవచ్చి కూచునేవారు. వెళ్ళమనడానికి వీల్లేదు. అదేమయిందనీ, యిదేమయిందనీ, అడుగుతుంటారు. చెప్పటం తప్పు. చెప్పకపోవడం తప్పు.

ఒక్కొక్కరు పనులు చేయించుకోడంలో చాలా నేర్పును చూపెడుతుంటారు.

"ఎల్లుండి మాఇంట్లో డిన్నర్ ఏర్పాటుచేశాం సార్. మంత్రిగారుకూడా వస్తున్నారు. మీరు తప్పకుండా రావాలి" అంటాడెవడో.

పోక తప్పేదేముంది.

సరిగ్గా సమయంలోనే, యెవరిచేతనో ఆ పని కాస్తా చెప్పించేస్తాడు ఆయన. 'అదేదో చేయించేయండి' అంటాడా గొప్పవాడు. శంకరానికి చెయ్యక తప్పేదేమీ లేదు. కానీ, ఆ పనివల్ల ఆ తరవాత యెలాంటి గొడవలొచ్చినా, మొత్తం బాధ్యత శంకరంమీదనే విరుచుకుపడుతుంది. తన కిష్టంలేని పని చెయ్యడమే కాకుండా దాని ఫలితాన్నికూడా నిశ్శబ్దంగా భరించవలసి వుంటుంది.

"ఇదంతా నా ఖర్మ!" అని అనేకసార్లు శంకరం నెత్తి బాదుకొన్నాడు.

నిజానికి ఈ గొడవలేమీ సత్యవతికి తెలీవు. శంకరం తనముందు వృత్తినే పోజు పెడుతున్నాడన్న అనుమానం ఆవిడకు వుంది. అతను మారిపోయాడనీ, తనమీద 'రుచి' తప్పిపోయిందనీ, ఆవిడకు అనిపిస్తూవుండేది. సత్యవతి దృష్టిలో ఇవి నిరాధారాలు కావు. ఆవిడ కారణాలు ఆవిడకూ వున్నాయి.

మొట్టమొదటి రోజుల్లో, శంకరం అస్తమానూ తన్ను ముసురుకొంటూవుండేవాడు. తనకోసం వెంపర్లాడుతూవుండేవాడు. తెలిసినవారందరికీ, తనను సగర్వంగా పరిచయం చేస్తూవుండేవాడు.

"ప్రతి పౌర్ణానికీ కొంతమందికి పిచ్చెక్కుతుందట. నాకు ప్రతి సాయంత్రమూ పిచ్చెక్కుతుంటుంది!" అన్నాడు శంకరం ఓసారి.

"ఎందుకట్లా?" అన్నది తను.

"మన్యాంత అందంగా యెందుకు పుట్టావు సత్యం? ఎందుకు నన్నిలా ప్రాణాలు తోడేస్తావమ్మా?" అన్నాడు శంకరం, కన్నార్పకుండా తనను చూస్తూ.

తను నవ్వితే చాలు—వెర్రెత్తిపోయేవాడు.

"అలా నీ కళ్ళల్లోకి చూస్తూ చచ్చిపోతే బావుణ్ణు సత్యం!" అనేవాడు శంకరం.

అలా అంటున్నప్పుడు అతని కళ్ళు కోరికతో మండుతుండేవి. ఒళ్ళమంతా గంపరించివుండేది. పెదవులు దాహంతో వొణుకుతుండేవి. పసిపిల్లాడిలా తన కొంగు పట్టుకొని వెంటపడుతుండేవాడు. ఏ కారణం లేకపోయినా పిలిచేవాడు యెందుకోనని దగ్గర కొస్తే, అటూ యిటూ చూసి గట్టిగా కావలించుకొని వదిలేవాడు. ఊపిరి ఆగిపోయేట్టు ముద్దెట్టుకొనేవాడు. ఒకోక్క రాత్రి అసలు నిద్రే వుండేదికాదు. భళ్ళున తెల్లవారేది.

ఏం కబుర్లు చెప్పుకొనేవారో యిప్పుడు జ్ఞాపకం లేదు. కానీ యెంత తియ్యని కబుర్లు, యెన్నిసార్లు విన్నా యింకా వినాలనిపించే కబుర్లు. మంచి వుద్యోగం, కారు, పనివాళ్ళు, సొమ్ములు, పిల్లలు, వారి చదువులు, వారి పెళ్ళిళ్ళు, వారికి మంచి వుద్యోగాలు—యివన్నీ మహాప్రవాహం లాగా దొర్లి

పోతుండేవి. కలకాలం తమ జీవితాలు యిలానే జరుగుతా యనుకొన్నది సత్యవతి.

కానీ, ఆ బొమ్మలన్నీ మాయమైపోయాయి. శంక రానికీ, తనకూ మధ్య క్రమక్రమంగా దూరం పెరిగిపోతున్న దని సత్యవతి అనుకోసాగింది. తను వున్నచోటనే వున్నా ననీ, శంకరమే యెడమవుతున్నాడనీ సత్యవతి నమ్మకం. ఇలా యెందుకు జరుగుతోందో మొన్న మొన్నటిదాకా, సత్యవతికి తెలీదు. ఈమధ్యనే ఆ గుట్టుకాస్తా ఆవిడ కనిపెట్టేసింది.

శంకరం ఆఫీసులో సుమతి అనేఆవిడ పనిచేస్తూ వుందిట. ఆవిడ అందంగా కూడా వుంటుందిట. శంకరం ఆవిణ్ణి తరుచుగా సినిమాలకూ, పార్కులకూ తీసికెడుతుంటా డుట. ఆవిడ పీసమెత్తుపని చెయ్యకపోయినా యేమీ అనడుట. అస్తమానూ ఆవిడతో కబుర్లు చెబుతూవుంటాడుట.

ఈ సువార్తను చేరవేసిన గుమాస్తా సత్యవతినుండి యే మాశించాడో మనకు తెలీదు. కారణం కోసం అల్లాడి పోతున్న సత్యవతి మనస్సుకు గట్టి కారణాలను అందించాడు. మంటను మరికాస్తా యెగదోశాడు.

అంతకుముందు శంకరం చిరాకుపడుతుంటే సత్యవతి మౌనంగానన్నా వుండేది. ఇప్పుడా చిరాక్కు ఆవిడ కొత్త కొత్త భాష్యాలు ప్రకటించసాగింది. శంకరం రాత్రి పది గంటలదాకా ఫైళ్ళముందు కూచుని, యెటో చూస్తూవుంటే సత్యవతి మనస్సు అసూయతో కుతకుతలాడిపోయేది.

"ఆఫీసువాళ్ళను గురించి ఆలోచిస్తున్నారా ?" అనేది సత్యవతి చాలా నెమ్మదిగా.

"కాదు" అనేవాడు శంకరం.

"ఒకవేళ, వాళ్ళనుగురించి అనుకొంటున్నారేమో ననుకొన్నా లెండి! పొద్దుపోయింది పడుకోకూడదూ?" అనేది సత్యవతి.

"నువ్వెళ్ళు, నేను పనిచూసుకొని వస్తా" అనేవాడు శంకరం.

ఒక్కోసారి ఏ రాత్రివేళనో లేచి చూస్తే శంకరం మంచంమ్మీద వుండేవాడు కాదు.

"సుమతికోసంగానీ వెళ్ళలేదు గదా!" అనుకొనేది సత్యవతి.

సరిగ్గా ఆ సమయంలోనే అతను, వరండాలో పడక కుర్చీలో పడుకొని ఆకాశంకేసి చూస్తూవుండేవాడు.

"ఇక్కడ కూర్చున్నారేం?" అనేది సత్యవతి, సాధ్యమైనంత లాంఛనంగా.

"నిద్రపట్టడం లేదు" అనేవాడు పంకరం.

"ఈపూట సుమతి ఆఫీసుకు రాలేదా?" అనేది సత్యవతి.

"వచ్చిందే! ఎందుకుట?" అనేవాడు శంకరం.

"ఊరికే అడిగాను లెండి" అనేది సత్యవతి, కోపాన్ని దిగమింగుకుంటూ. "ఆవిణ్ణోసారి మనింటికి తీసుకురాకూడదూ! నేను చూస్తానూ!"

"నే చెబితే వస్తుందా?" అనేవాడు శంకరం.

"మీకిందపనిచేసే ఆవిడ మీరు చెప్పినట్లల్లా చేస్తుందిగానీ, కాదంటుందా మరి?" అనేది సత్యవతి.

అక్కణ్ణుంచి మాటలు పెరిగేవి. ఒకరినొకరు మాటలతో తీవ్రంగా గాయపరుచుకొనేవారు. రక్తం కారిపోతున్న మనస్సులతో వెళ్ళి మంచాలమీద పడేవారు, ఇక ఆ రాత్రికి నిద్రవుండేది కాదు.

ఏమాత్రం అవకాశం దొరికినా సత్యవతి సద్వినియోగపరుచుకొనేది. పదునైన మాటలన్నీ ఏరి అతనిమీద ప్రయోగించేది. శంకరం గిజగిజలాడిపోతుంటే ఆవిడ హృదయం ఆనందంతో నాట్యం చేసేది. రానురాను వారికిది నిత్యకృత్యమయిపోయింది.

శంకరం పెందరాడే యింటికొస్తే 'ఈపూట సుమతికి తీరికలేదల్లేవుందే!' అనేది సత్యవతి. పొద్దుపోయివస్తే 'ఇంటిదాకా పంపించి వొచ్చారుగదా! పోన్లెండి పాపం! ఆడకూతురాయె! ఇంతపొద్దోయి ఒంటరిగా యింటికెళ్ళగలుగుతుందా మరి!' అనేది. ఈ గొడవలన్నీ పడలేక శంకరం ఎక్కణ్ణో తలదాచుకొన్నాడనుకోండి. "ఏ హోటల్లో వున్నారేమిటి?" అనేది సత్యవతి.

మొదట్లో శంకరం మండిపడ్డా రానురాను అతనూ మొండికెత్తిపోయాడు.

"కొంతమంది మొగుళ్లు భార్యలను ఎందుకు చెండుకు తింటారో, మొన్న మొన్నటిదాకా నాకు తెలీలేదు. నిన్ను చూస్తూంటే యిప్పుడు నాకు అర్థమవుతోంది!" అన్నాడు శంకరం ఓసారి.

'అయితే మీరూ చెండుకు తినండి. మిమ్మల్ని కాదనేదెవరు గనక?" అన్నది సత్యవతి.

'ఆ పని చెయ్యదలచుకొన్న రోజున నీ అనుమతి పొందకుండానే చేస్తాను. అంతదాకా రావడం మనిద్దరికీ మంచిదికాదు ఎవరి మానాన వాళ్ళం బ్రతుకుదాం. ఆగర్భ శత్రువులకుమల్లే ఒకళ్ళ నొకళ్ళం బాధించుకోవడం అసహ్యంగా వుంది" అన్నాడు శంకరం.

"ఏదోవిధంగా నన్ను వదిలించుకొని ఆ సుమతితో కాపరం పెడతారా?" అన్నది సత్యవతి చాలా తాపీగా.

శంకరం బలహీనంగా నవ్వాడు.

"నాకా అవకాశం లేకపోలేదు సత్యం. కాని, దాన్ని నేను వాడుకోను. మనుష్యుల్ని యిరుకులో పెట్టి దత్తి తీర్చుకోవడం నా స్వభావానికే విరుద్ధం. ఇంతవరకూ సుమతిని గురించి నాకెటువంటి ఆలోచనా లేదు. నువ్వంటున్నావు గనక యీ రోజునుంచీ ప్రయత్నాలు ప్రారంభిస్తాను" అన్నాడు శంకరం.

సత్యవతి కూడా నవ్వింది.

"ఈ నంగనాచి కబుర్లన్నీ నమ్ముతున్నాననని మీరనుకోవడమే చిత్రంగావుంది. నిజం చెప్పండి. సుమతితో మీకెలాంటి సంబంధమూ లేదూ?" అన్నదావిడ సాగదీస్తూ.

శంకరం మాట్లాడలేదుగనీ, భార్యకేసి అసహ్యంగా ఓ చూపు పారేశాడు.

"మీ చేతికింద పనిచేసే ఆడదాన్ని, మీరు వూరికే విడిచిపెడతారని నే ననుకోవలసిందే నంటారు... ఏం? ... మాట్లాడరేం?" అని రెట్టించేది సత్యవతి.

"అనదలిస్తే నేనూ చాలా అనే అవకాశాలున్నాయి సత్యం! ఆ మాట నే నన్నతరవాత, నువ్వు నిలువునా ఖూనీ అయిపోతావు. తెలుసా ?" అన్నాడు శంకరం.

సత్యవతి అభిమానం గాఢంగా దెబ్బతిన్నది. రేచు కుక్కలా పేట్రేగిపోయిందావిడ.

"ఏమనదలచుకొన్నారో అనండి! మనస్సులో కుళ్లు పెట్టుకోవడ మెందుకూ ? అన్నది సత్యవతి.

"నువ్వుమాత్రం యింకొకరితో స్నేహం చేసే అవకాశాలు లేవా అని నేనంటే యేం బావుంటుంది చెప్పు. మనింటి ప్రక్కనే గదా ప్రభాకరం వున్నాడు! నేనింట్లో లేనపుడు నువ్వతనితో సినిమాలకూ, షికార్లకూ పోతున్నావని నే నంటున్నాను నువ్వేమంటావ్?" అన్నాడు శంకరం.

సత్యవతి నెత్తిన పిడుగుపడింది. శంకరం నోటినుండి యిలాంటి మాట వినాలిసొస్తుందని ఆవిడే మాత్రం అనుమానించలేదు. ఆవిడ అహంకారమంతా ఒక్క క్షణంలో బూడిదయిపోయింది. రెండు చేతులూ ముఖానికి కప్పుకొని పసిదానిలా బావురుమని యేడ్చింది సత్యవతి.

"ఆడదానివి గనక, లగ్గలకెత్తి యేడ్చే అవకాశం నీకుంది. నాకు లేదు. ఒక్కమాటకే నువ్విలా కుప్పగూలి పోతే రోజూ నువ్వంటున్న' మాటలకు నేనేమయివుండాలి సింది ?" అన్నాడు శంకరం.

సత్యవతి యే జవాబూ చెప్పలేదు. తలుపుదగ్గర కూలబడి ఒకటేమోయిన యేడవసాగింది. ఈ అసహాయత్వాన్ని చూశాక శంకరం మరింత రెచ్చిపోయాడు.

"నాకు నిద్రపట్టకపోవడానికి మమతే కారణమన్నావు. అనేక రాత్రులు నువ్వుకూడా నిద్రపోకుండా వున్నావుగదా! నీకు ప్రభాకరం జ్ఞాపకం వచ్చాడని నే ననవలసిందేనా? సంస్కారం యేమాత్రం లేనిదానివి గనక నువ్వామాట లన్నావు. నేననను. అందమైన ఆడది కనిపిస్తే మగాళ్ళకు మతులుపోతాయన్నావు. కుక్కల్లాగ వాళ్ళ వెంటపడతా రన్నావు. నువ్వు అందంగానే వుంటావుగా మరి? ప్రభాకరం మతి పోగొట్టుకొన్నాడా? నీ వెంట కుక్కలాగా తిరిగాడా? మాట్లాడవేవమ్మా?" అని దులిపేశాడు శంకరం.

చాలా రోజుల తరవాత అతని మనస్సు తేలిగ్గా వుంది. సత్యవతిని చిత్తుచేశానన్న సంతృప్తితో, అతను హాయిగా నిద్రపోయాడు. ఓరాత్రివేళ యెందుకో మెళుకువ వొచ్చింది. లేచిచూస్తే, సత్యవతి నడిమంచంమీద కూచుని కుళ్ళికుళ్ళి ఏడుస్తోంది. వెళ్ళి సముదాయించడమా, మానడమా, అని కాస్సేపు మల్లగుల్లాలు పడ్డాడు శంకరం. ఆవిడతో తను గడిపిన పూర్వపు రోజులన్నీ జ్ఞాపకమొచ్చాయి. అతని మనస్సు ద్రవించిపోయింది మెల్లగా ఆవిడ మంచంమీదికి జరిగి భుజంమీద చేతులేశాడు. సత్యవతి అతన్ని కావలించుకొని, గుండెల్లో ముఖం దాచుకొని బావురుమన్నది.

"ఎంతసేపణ్నించీ యిలా యేడుస్తున్నావు సత్యం?" అన్నాడు శంకరం, ఆమె వీపుమీద మెల్లగా తడుతూ.

"నిజంగా మీరామాట నమ్మే అన్నారా?" అన్నది సత్యవతి, ఏడుపు మానకుండానే.

"ఏమాట?" అన్నాడు శంకరం. ఓక్షణం ఆలోచించి "ఓహో! ఆ సంగతా!"

"మీకు కల్లాంటి అనుమానం వుంటే, నన్ను చంప కూడదూ?" అన్నది సత్యవతి.

"అనుమానముున్నదని నేననడంలేదు. అనుమానపడ డానికి అవకాశం వుందా లేదా అని మాత్రమే నేనన్నాను. అయినా నువ్వన్నవాటితో పోలిస్తే యిదేపాటిదిట? ఇల్లంటే భయపడి చచ్చేటట్టు చేశావు" అన్నాడు శంకరం

"నా స్థితిలోవుంటే మీరూ యిలాగే వుండేవారు" అన్నది సత్యవతి.

"దురదృష్టవశాత్తూ మొగాణ్ణయిపోయాను. నేనే ఆడదాన్నిగా పుట్టివుంటే, నా భర్తను అద్భుతంగా సుఖపెట్టి వుందును ఇప్పుడేం చెప్పిమట్టుకేం ప్రయోజనం" అన్నాడు శంకరం.

అంత విచారంలోనూ సత్యవతికూడా నవ్వగలిగింది.

"నా ఖర్మగాని, నేను ఆడదాన్నయిపోయానుగానీ, మగాడుగా పుట్టివుంటే, భార్యను నెత్తిమీదాంచి దించక పోదును" అన్నది సత్యవతి.

చాలా రోజులతరవాత వారిద్దరూ అరవిడిచి మాట్లాడు కున్న దిప్పుడే.

"ఈ మాటల్ని రుజువు చేసుకొనే అవకాశం మన కిప్పుడు లేదు పూర్వకాలంలోనుట మనుష్యులకు బ్రహ్మాండ మైన శక్తులుండేవిట, ఏ రూపం కావాలంటే ఆ రూపం

యొత్తేవారట! అలాంటి కిటుకేదో మనకూ తెలిస్తే బావున్ను" అన్నాడు శంకరం నవ్వుతూ.

సత్యవతి కళ్ళల్లో కూడా చిలిపితనం పొటమరించింది.

"భగవంతుడి దయవల్ల అలా జరిగితే బావుండిపోను. సుమతి వ్యవహార మీదో క్షణాలమీద తేల్చేస్తాను" అన్నది సత్యవతి నవ్వి.

శంకరం నిట్టూర్చాడు.

"ఇక పడుకొందాం. మళ్ళీ రేపు బోలెడంత పనుంది" అన్నాడు శంకరం వృత్తినే వొళ్ళు విరుచుకొంటూ.

"ఏదండి!" అన్నది సత్యవతి అతని చేతిని సన్నగా నొక్కి.

శంకరం శరీరం జలదరించింది. అతను భార్యకేసి చూశాడు. మాలిన్యం కోల్పోయిన తామర పువ్వులా కని పించింది సత్యవతి ఆవిడ బుగ్గలమీద కన్నీటిచార లింకా ఆరనేలేదు. సత్యవతిని రెండు చేతులతోనూ పొదువుకొని గుండెల కొత్తుకొన్నాడు. దాహంతో ఉవ్విళ్ళూరుతున్న అతని శరీరం సత్యవతిమీదికి విరుచుకుపడింది. సత్యవతి మనస్ఫూర్తిగా తనను తాను . చాలా రోజుల తరవాత— అర్పించుకొంది.

# కల్పన

భూలోక సంచారంచేస్తున్న పార్వతీపరమేశ్వరులు యీ గొడవనంతా చూశారు. శంకరు డేమీ అనలేదు గానీ, పార్వతీదేవి మాత్రం వూరుకోలేకపోయింది.

"అయితే స్వామీ! ఈరాత్రి వీరిద్దరూ బాగా వున్నారనసరే ననుకోండి. ఇకముందు కూడా యెటువంటి కలతలూ లేకుండా సుఖంగా వుంటారా?" అన్నది పార్వతమ్మాయి.

శంకరు డేమీ పలకలేదు.

"అదేమిటి స్వామీ! నా మాటకు జవాబుకూడా చెప్పరేం?" అన్నది పార్వతి.

"ఇంతకన్నా నేనేం చెప్పటమూ భావ్యం కాదు. తరచి తరచి అడగొద్దు" అన్నాడు శంకరుడు.

పార్వతీఅమ్మవారికి చాలా కోపం వచ్చింది.

"అయితే మీరూ నానుండి యేదో దాస్తున్నారన్న మాట! నన్ను పూర్తిగా విశ్వసించలేదన్నమాట అంతేనా?" అన్నది అమ్మవారు.

"ఎవ్వరికీ చెప్పకూడని విషయాలు, అందరికీ కొన్ని కొన్ని వుంటాయి. వాటిని గురించి పదేపదే అడగటం భావ్యం కాదు. "పూర్తిగా నన్ను విశ్వసించలేదా?"

అనన్నావు. దాన్ని గురించి సమాధానం చెప్పడానికిది సమయం కాదు" అన్నాడు శంకరుడు.

ఈ సమాధానంవల్ల పార్వతీఅమ్మవారికి అర్థమయిందేమీ లేదు కాని ఆమెగారికో ఆలోచన వచ్చింది. అదే గనక జరిగితే వారి జీవితం చాలా హాయిగా వుంటుందని కూడా ఆమెగారు అనుకొంది.

"ఏమిటా బ్రహ్మాండమైన ఆలోచన" అన్నాడు శంకరుడు.

"తను స్త్రీగా వుంటే, భర్తను నెత్తిమీద పెట్టుకొంటానన్నాడు శంకరం. తను మగాడయితే, భార్యను పువ్వుల్లో పెట్టి పూజిస్తానంటోంది సత్యవతి" అన్నది పార్వతి అక్కడకొచ్చి హఠాత్తుగా ఆగిపోయి.

"కాబట్టి?" అన్నాడు శంకరుడు.

"వారి వారి కోరికల ప్రకారం అలా మార్చేస్తే పోదా?" అన్నది పార్వతి.

"అప్పుడైనా వారు సుఖంగా వుంటారా?" అన్నాడు శంకరుడు.

"ఉంటారని నేననుకొంటున్నాను. అయినా పోయిందేముంది గనక? కొంతకాలం వారు కావాలనుకొంటున్న రూపాల్లో వుండమందాం. ఆ జీవితాలతో వారు సుఖపడగలిగితే సరేసరి. లేదా—ఎప్పటిలాగానే మార్చేద్దాం. ఏమంటారు?" అన్నది అమ్మవారు, శంకరుణ్ణి ఒప్పుకోవలసిందిగా ప్రాధేయపడుతూ.

"జీవితాలు యెందుకు దుఃఖభాజనమవుతున్నాయో నీ కిప్పుడైనా తెలిసిందా? ఎవరి బ్రతుకు వారు బ్రతకరు. ఎవరి విధులు వారు నిర్వహించరు. ఒకరి విషయాల్లో మరొకరు జోక్యం కలగచేసుకోవడం వల్లనే ప్రపంచం యింత అధ్వాన్నంగా తయారయింది" అని విసుక్కొన్నాడు శంకరుడు.

అయినా పార్వతీదేవి తను పట్టినపట్టు విడిచిపెట్టలేదు. చాలాకాలం తరువాత తనో కోరిక కోరాననీ, దాన్ని చెల్లించవలసిందనీ ప్రాథేయపడింది. తనకైనా వారి జీవితాలను బాగుచేయడం తప్ప, మరో వుద్దేశం లేదన్నది. ఈ ఆఖరు మాట విని శంకరుడు చిరునవ్వు నవ్వాడు.

"వారి సుఖంకోసమే చేస్తున్నానని నువ్వన్నప్పటికీ నీ అసలు వుద్దేశ మదికాదని నే ననుకొంటున్నాను. వారి కొత్త ఆకారాల్లో యెలా ప్రవర్తిస్తారో చూడాలన్న కోరిక చాలా బలంగా వుండివుంటుందని నా అనుమానం. అయినా నువ్వడిగావు గనక అలానే చేద్దాం. వారిప్పుడు ఆదమరిచి నిద్రపోతున్నారు. వారి కలలో కనిపించి యీ సంగతి చెప్పు" అన్నాడు శంకరుడు.

పార్వతీ అమ్మవారు సంతోషాయత్త చిత్తురాలయి, అవ్విధంగానే చేసినటువంటి వారయినారు.

"ఇప్పుడేమవుతుందంటి?" అన్నదా జగన్మాత.

"వేచి చూడు. అంతకన్నా ఏం చెప్పడమూ శావ్యం కాదు" అన్నాడు శంకరుడు.

పార్వతి సన్నగా నిట్టూర్చింది.

* * *

శంకరం వులిక్కిపడిలేచాడు. సత్యవతి పక్కమంచం మీద వెల్లికితలా పడుకొని వుంది. జుట్టంతా చెల్లాచెదరయి పోయింది. ముఖంమీద వెంట్రుకలు గాలికి గిలగిల లాడుతున్నాయి. పమిట ఓ ప్రక్కకు తొలగివుంది. మెడకింది ముడతల్లోని చెమట వెండిరజనులా మెరిసిపోతోంది. పలచని పొట్ట, మేలిమిముద్దలా వూపిరితోబాటు యెగసిపడుతోంది. శంకరం, మెల్లగా సత్యవతి మంచంమీదికి జరిగాడు. ఆమెను తనవేపు తిప్పుకొని నడుంమీదుగా చెయ్యిజాచ్చి, దగ్గరగా తీసుకొన్నాడు. సత్యవతి ఓక్షణం కళ్ళు తెరచి, మళ్ళీమత్తుగా మూసుకొంటూ, అతనిమీదికి ఒరిగింది.

"నిద్రపోతున్నావా సత్యం?" అన్నాడు శంకరం భార్య బుగ్గలకు పెదవులానించి.

"ఊఁహు" అన్నది సత్యవతి, మరింత దగ్గరగా అతనికేసి జరిగి.

"మీరు నిద్రపోలేదా ?"

"పోయాను. ఎందుకోగానీ మెలుకు వొచ్చింది" అన్నాడు శంకరం.

అతని గొంతులో సన్నగా కంపరం ప్రారంభమయింది.

"కలగానీ రాలేదుకదా !" అన్నది సత్యవతి, ఈసారి పూర్తిగా మత్తునుండి విడిపోయి.

శంకరం బిత్తరపోయాడు.

"నీ సంగతేమిటి సత్యం ? నీకూ—"

"మరే !" అన్నది సత్యవతి.

"ఎవరో ఒకావిడ కలలో కనిపించి తెల్లవారేసరికి నేను మగవాణ్ణయిపోతానుట. మీ్రారేమో ఆడవాళ్ళవుతారట. కొంతకాలందాకా యీవిధంగా మనమున్న తరవాత, అవసర మనుకొంటే, పూర్వపు రూపాల్లోకి మళ్ళీ రావచ్చుననీ, లేకపోతే ఇలానే వుండిపోవచ్చుననీ చెప్పింది" అన్నది సత్యవతి, చాలా వుత్సాహంగా.

శంకరం నిలువునా చలించిపోయాడు. అప్పటికప్పుడే తనో స్త్రీ నయిపోయినట్టు అతని కనిపించింది. కిందికీ మీ్రాదికీ తన్నొకసారి చూసుకొన్నాడు.

"నాకు - నాక్కూడా యిలాంటి కలే వచ్చింది !" అన్నాడు శంకరం.

"ఇది నిజమవుతుందంటారా ?" అన్నది సత్యవతి కళ్లు టపటపలాడిస్తూ.

"అయితే బావుణ్ణుమరి !" అన్నాడు శంకరం గడియారంకేసి చూస్తూ. "మరో రెండుగంటల్లో సూర్యోదయమవుతుంది. మనకొచ్చిన కల నిజమవుతుందో కాదో అప్పటికి తేలిపోతుంది. నిజమయితే ఇద్దరమూ, నూతనానుభవాలను పొందుతాం. జీవితంలోంచి యిప్పుడున్న మామూలుతనంపోతుంది. ఒకరికి తెలీకుండా మరొకరు సుఖపడిపోతున్నారన్న తపనకు తావుండదు. కల కలగానే వుండిపోతుందనుకో. మన మామూలు బ్రతుకు ఉండనేవుంది."

సత్యవతి, అతనన్న మాటలన్నీ ఆసక్తిగా విన్నది. శంకరంకేసి కన్నార్పకుండా చూసింది. ఆ చూపులు అతని

సర్వాంగాలను తడివి చూసినట్లనిపించింది. రానురాను ఆమె కళ్లు మిలమిలలాడనాగాయి. సన్నగా ప్రారంభమైన నవ్వు, ఉప్పెనలా విస్తరించింది. రెండు చేతులూ శంకరం భుజాల మీద వేసి ఉంగలు తిరిగిపోయేలా నవ్వింది సత్యవతి.

"ఎంతకాలానికి సత్యం నవ్వగలిగింది?" అనుకొన్నాడు శంకరం.

ఆ నవ్వుకు కారణం తెలుసుకోవాలని కూడా అతనికి తట్టలేదు.

"నే నెందుకు నవ్వుతున్నానో మీరు రడగరేం? అన్నది సత్యవతి.

"చెప్పదలిచింటే తే నువ్వేటుగాడి చెబుతావు. రహస్యమయితే నే నడిగినా చెప్పవు. అంచేత కారణం నే నడగలేదు" అన్నాడు శంకరం.

సత్యవతి మరోసారి ఒగలబడి నవ్వి, ఆ తరవాత బలవంతాన తేరుకొంది. అపరిమితమైన నవ్వువల్ల ఆమె కళ్లు నీటితో నిండిపోయాయి.

"మన కలలే నిజమయితే, మీ ఆకారం యెలా వుంటుందో తలుపుకొచ్చి నవ్వుతున్నాను" అన్నది సత్యవతి మరోసారి నవ్వి. "అప్పుడు మీకు మీసాలు, గరుకు గడ్డం వుండవు. ఉంగరాల జుట్టు కాస్తా పొడుగ్గా యెదుగుతుంది. యెత్తుగా, లావుగా..." అని, అతని ఎదు ర్రొమ్ముమీద వేలితో కితకితలు పెట్టింది సత్యవతి.

శంకరం ఓసారి తన గుండెలకేసి చూసుకొని ఫక్కున నవ్వాడు.

"మరో రెండు గంటలకు నాకిక్కడ..."

ఛటుక్కున సత్యవతి అతని నోరు మూసేసింది. శంకరం ఆమె వేళ్ళను ముద్దుపెట్టుకొన్నాడు.

"నువ్వు మాత్రం మారిపోవా సత్యం? అందంగా, అద్దాల్లాగా వుండే యీ బుగ్గలమీద వెంట్రుకలొస్తాయి గదా! ద్రాక్షపళ్ళలా రుచిగావుండే యీ పెదవులమీద మీసాలొస్తాయి. అప్పుడు ప్రతిరోజు నువ్వు గడ్డం చేసుకోవలసివుంటుంది" అన్నాడు శంకరం.

"ఆఫీసు పనితో నాకు మాత్రం తీరిక వుంటుందా మరి?" అన్నది సత్యవతి.

ఈ సమాధానం శంకరం తరుచుగా అంటున్నదే?

"బరుకుగడ్డంతో నా దుంప తెంచుతానంటే ఒప్పుకోను. వేరే మంచంమీద పడుకోవలసిందే!" అన్నాడు శంకరం భార్య కళ్ళల్లోకి చిలిపిగా చూస్తూ.

"మీరిలా చేశారు గనకనా నేను చెయ్యడానికి, నేను పడ్డ యిబ్బందులన్నీ మీరూ పడవలసిందే!" అన్నది సత్యవతి.

"నామీద కసితీర్చుకొంటావా సత్యం?" అన్నాడు శంకరం భార్యను దగ్గరగా పొదువుకొని.

సత్యవతి గువ్వలాగా అతని కౌగిట్లో యిమిడిపోయింది. అతను మెల్లగా భార్య కాలు గీరాడు. సత్యవతి ఛటుక్కున కాలు ప్రక్కకు తీసుకొంది.

"తెల్లవారొస్తోంది. ఇప్పుడేమిటీ మేళం!" అన్నదావిడ, పెనగులాడకుండానే.

"కల నిజం కావడమే జరిగితే, నాకిక కాలు గిరే అవకాశమే వుండకూడదా మరి? మనసారంగా యీ సుఖాన్ని మళ్ళీ యెంతకాలానికి అనుభవిస్తానో యేమో తెలీదు. అదీ గాక—మనమూ కొత్త కాపురాల్లో సుఖసంబమే జరిగితే ఇదే ఆఖరి అవకాశమవుతుంది. అందుకని—" అన్నాడు శంకరం భార్య చెవిలో.

సత్యవతికూడా యీ ఆర్గ్యుమెంటు సబబుగా కని కనిపించింది. కింది పెదవి మునిపంటితో కొరుకుతూ, కన్ను చికిలించి శంకరాన్ని వెక్కిరించింది. శంకరం లైటు తీసేశాడు. మసగకాంతిలో అప్సరసలా నిలుచున్న సత్యవతిని గాఢంగా కావలించుకొని తలను వాసన చూశాడు శంకరం; సత్యవతి మునికాళ్ళమీద నిలబడి అతని పెదవు లందుకొంది.

* * *

గడియారం ఠంగు ఠంగుమని ఆరుగంటలు కొట్టింది. పనిమనిషి వొచ్చి దబదబా తలుపులు బాదుతోంది.

సత్యవతి బద్ధకంగా లేచింది. అంతకన్నా బద్ధకంగా వొళ్ళు విరుచుకొంది. గోళ్ళతో జుట్టు సరిచేసుకోవడం ఆవిడ కలవాటు. అదేవిధంగా చేతులు రెండూ వెనక్కు చాపి మెటికలు విరుచుకొని, ఆవలించి జుట్టు సరిచేసుకోబోయింది. పట్టుదారాల్లా వుండవలసిన వెంట్రుకలు బిరుసెక్కి వుక్కు తీగల్లా వేళ్ళకు తగిలాయి. సత్యవతి క్షణకాలం దిమ్మెర పోయింది. చేతులతో తల తడువుకొంది. పొడవైన జడకు బదులు పొట్టి క్రాపు మాత్రమే తగిలింది. అప్రయత్నంగా గుండెలకేసి చూసుకొంది. నల్లని వెంట్రుకలు చిత్రవత్తుగా

వున్నాయి. మామూలుగా తను తొడుక్కునే తెల్లజాకెట్టుకు బదులు శాండోబనీ నున్నది. రాత్రి తను కట్టుకొన్న వాయిల్ చీరెకు బదులు గళ్ళ లుంగీ వొంటిమీదున్నది.

"కల నిజమయిందన్నమాట!" అనుకున్నది సత్యవతి.

ఈలోగా పనిమనిషి తలుపులు విరిగేలా బాదుతోంది.

"వస్తున్నా నుండవే! ఎందుకలా గొంతు చించుకొంటావ్!" అన్నది సత్యవతి.

ఆ గొంతు విని ఆవిడ ఆశ్చర్యపడ్డది. అచ్చు శంకరం గొంతులాగే మారిపోయిందది. శంకరం మంచంకేసి చూసిందావిడ. అతగాడు హాయిగా నిద్రపోతున్నాడు. తుమ్మెద రెక్కల్లా వుండే మీసాలు గానీ, బరుకుగడ్డం గానీ లేవు. ముమ్మూర్తులా తనలాగా తెల్లజాకెట్టు వేసుకొని, వాయిల్ చీర కట్టుకొని, జడను మెడమీదుగా గడ్డంకిందికి జార్చుకొని, గొంతుదాకా దుప్పటి కప్పుకొని పడుకొన్నాడు. లేచాక యెంతాశ్చర్యపడతాడో ననుకొన్నది సత్యవతి.

"ఏం తల్లీ! తలుపు తీస్తారా, నన్ను పొమ్మంటారా?" అన్నది పనిమనిషి మరోసారి తలుపుల్ని చెడబాదుతూ.

"వస్తున్నానే భడవా! ఏమిటా దిక్కుమాలిన తొందర?" అన్నది సత్యవతి గబగబా రెండడుగులు ముందుకు వేసింది. ఎవరో ఆవిడ కాళ్ళకు బంధాలు వేసినట్లనిపించింది. లుంగీ కాళ్ళకు చుట్టుకొని అడుగు ముందుకు పడనివ్వడంలేదు.

ఓహో! ఆయనలాగా దీన్ని మోకాళ్ళదాకా యెగగట్టాలి గావును!" అనుకొన్నది సత్యవతి.

ఓ నిమిషంపాటు శంకరం యెలా లుంగీని కట్టుకొనేది

మననం చేసుకొంది. రెండు చెంగులూ పట్టుకొని, చేతుల పొడవునా బారాచాపి. పిరుదులమీదుగా కిందిఅంచును రానిచ్చి, ముందుభాగాన మెలికచుట్టింది సత్యవతి. లుంగీ మడతయితే పడిందిగానీ, మోకాళ్ళనుండీ కిందిభాగమంతా కనపడుతూనేవుంది. ఇలా మోండికాళ్ళతో తలుపులు తీయడమెలా? ఎవరన్నా చూస్తే యేమనుకొంటారు? ఫలానా ఆవిడ లుంగీలు కట్టుకొంటోందనీ తెలిస్తే, ఇంట్లో సిగరెట్లు కాలుస్తుందనికూడా అనుకొంటారు గదా! ఇప్పుడేం చేసేట్టు?

"రాత్రి జాగారం చేసినారా ఏందితల్లీ! తలుపులన్నీ బిడాయించుకొన్నారు... ఓ సత్తెవతమ్మగారూ! జరంత లేస్తవా? లేవవా?" అంటోంది పనిమనిషి.

"వస్తున్నానే, ఏ గొంతుకొయ్య!" అన్నది సత్యవతి.

ఆ గొంతు విన్నాకగాని, తను మగాడుగా మారిపోయిన సంగతి మరోసారి స్ఫురించలేదు. తనింత సేపట్నుంచీ స్త్రీననే అనుకొని లుంగీతో బయటికెళ్ళడానికి తటపటాయిస్తోంది మగాళ్లు లుంగీ కట్టుకొంటే తప్పేమిటిగనక?

లుంగీ ముడి జారకుండా జాగ్రత్తగా అడుగుల్లో అడుగులు వేసుకొంటూ తలుపు గడియ తీసింది సత్యవతి. ఆ వచ్చిన మనిషి సత్యవతే ననుకొని అడుగు లోపలకి పెట్టబోయిన సూరమ్మ ఛటుక్కున కాలు వెనక్కు తీసుకొంది.

"వస్తున్నానంటే యెందుకే అలా గొంతు చించుకొంటావ్? ఓ క్షణంపాటు ఆగలేవూ?" అన్నది సత్యవతి.

'మీరనుకోలేదు బాబయ్యగారూ! అమ్మగారనుకొన్నాను అరిచి జరంత పొద్దునిద్దరలేండి, అనుమంటప్పుడు

గట్టిగా అరవమని అమ్మగారే సెప్పిర్రు" అన్నది సూరమ్మ.

సత్యవతికి నవ్వొచ్చింది. సూరమ్మన్నట్టు తనది కాస్త మొద్దు నిద్ర. అందుకని విసుగెత్తిపోకుండా ఒకటికి నాలుగు సార్లు పిలవమని తనెప్పుడో దానికి చెప్పింది.

"అట్టన్నేంది బాబుగారూ! అమ్మగారికి వొంట్లో గరంగా వుండదంట్రా?" అన్నది సూరమ్మ.

సత్యవతి యేమీ మాట్లాడలేదు.

"అమ్మగారి మనసులో గుబులుండాది బాబుగారూ! ఇంకోరితో సెప్పరు. ఎప్పుడూ ఆలోచిస్తూ కూసుంటారు, కూలాసాగా వుండమ్మ అంటే యినిపిచ్చుకోరండీ! నాకప్పుడే అనిపిచ్చిందిలేండి— అమ్మగారికి లోజరం కాస్త వుండదని!"

సూరమ్మ కబుర్లు చెబుతూనే వరండా అంతా వూడుస్తోంది. సత్యవతి వంటింట్లోకి వెళ్ళిపోయింది. సూరమ్మ యింకా మాట్లాడుతూనేవుంది.

"మాయముండ. గాలితోనైనా కబుర్లాడుతూ కూచుంటుంది!" అనుకొన్నది సత్యవతి.

అంట్లన్నీ వంటింటి గడపదగ్గర పోగేసింది. మసి గుడ్డలు, దబ్బరగిన్నెలో పడేసింది. మూలనున్న కొబ్బరి ఈనెల చీపురు తీసుకొని, ఓచెయ్యి వీపుమీద పెట్టుకొని, వంటిల్లంతా వూడుస్తోంది సత్యవతి. ఈలోగా సూరమ్మ అక్కడకు రానూవచ్చింది. సత్యవతిని చూసి మూర్ఛపోయినంత పని చేయనూ చేసింది.

"అదేందండి బాబుగారూ!" అని ఏదో అనబోయింది సూరమ్మ. దాని నోట మాట రాలేదు. అది పనిచేయడం

మరచిపోయింది. ఓ చెయ్యి గడ్డంకింద పెట్టుకొని, కళ్ళింత చేసుకొని సత్యవతికేసి చూస్తోంది.

"అలా నిలుచున్నావేం మొక్కలాగా! వెళ్ళి అంట్లు తోమరాదా! అయ్యగారు లేచేసరికి కాఫీకాకపోతే, పురాణం ప్రారంభించారన్నమాటే!" అన్నది సత్యవతి.

సూరమ్మ యేమాటా అనలేదు. కనీసం అక్కణ్నుంచి కదలనుకూడా కదల్లేకపోయింది.

శంకరంగారికి నీళ్ళు కాచడంకూడా చాతకాదని సత్యవతి అనేకసారు సూరమ్మతోనే చెప్పింది తనుగనక యీ మనిషితో వేగుతున్నాననీ, యింకొకత్తైతే, యీపాటికి జండా పీకించేసి వుండేదన్న అర్థం వచ్చేలాగా ఎన్నోసార్లు మాట్లాడింది. ఇంటిని గురించి యేమాత్రం పట్టించుకోని మగవాడు శంకరం వొక్కడేనని సత్యవతి ఎన్నోసార్లన్నది. ఆమాటలనుబట్టి చూస్తే శంకరం వృత్త అర్భకుడనుకోవాలి. కానీ సూరమ్మ కంటికి అలా కనిపించడంలేదు.

"అచ్చంగా అమ్మగారిలా పనిచేస్తా వున్నారు. అట్లానే మాట్లాడుతున్నారు. ఏమిటిది?" అనుకొన్నది సూరమ్మ.

ఈలోగా సత్యవతి స్టౌనిండా కిరసనాయిలు కొట్టింది. కిరసన్ చేతులను మామూలుగా కిటికీవూచలకురుద్ది, గూట్లో వున్న శనగపిండి కాస్త చేతుల్లో వేసుకొని, రుద్దుకొంటూ పంపుదగ్గరకొచ్చింది. వంగి చేతులు కడుక్కొంటున్నప్పుడు పమిట జారకుండా వుండేందుగ్గాను; ఎడంభుజం యెగరేసి, పమిటచెరుగును గాలిలోకి లేపి, ఛటుక్కున ఓ వలయం

తిరిగి చెరుగుచివర కుడివేపు వొచ్చేలాగా, గాలికి నిలుచుంది సత్యవతి.

నిజానికవన్నీ అనవసరమే! ఆవిడకు తను మగవాడుగా మారినసంగతి జ్ఞాపకంలేదు. తను లుంగీకట్టుకొని వున్నానని గానీ, తనవొంటిమీాద శాండో బనీనున్నదని గానీ సత్యవతికి తెలీదు. ప్రతిరోజూ చేసినట్టే యీరోజూ చేసింది.

చేతులు కడుక్కొని, తడిచేతులు పమిటకు పూసుకోవడం సత్యవతికి అలవాటు. అదే విధంగా ఈపూటకూడా పమిటకోసం చేతులు చాపింది. అదక్కడ లేకపోయేసరికి వులిక్కిపడింది. అప్పటిగ్గానీ, అసలు సంగతి ఆమెకు స్ఫురించలేదు. ఆక్షణాన సత్యవతికి యెందుకోగానీ నవ్వు వచ్చింది. ఆ వెంటనే రవంత భయంకూడా వేసింది.

"కొంపతీసి యిప్పటికిప్పుడే నేను బైటపడలేదుగదా!" అనుకొన్నది సత్యవతి. పనిమనిషి కేసి చూస్తే, అది దయ్యాన్ని చూచినట్టు, సత్యవతిని చూస్తోంది.

శంకరం పనిమనిషిని పలకరించేవాడో లేదో సత్యవతికి స్ఫురించలేదు. అథవా పలకరించినా, దానితో అట్టే కబుర్లాడే అవకాశం అతని కేనాడూ లేదు... తనిప్పుడు శంకరంగా మారిపోయింది. ఆయన ధోరణిలోనే మాట్లాడాలిగానీ, సూరమ్మ తనకు తెలుసు గనక, మామూలుగా వుంటే కొంపలంటుకొన్నయ్యన్న మాటే !

"అమ్మగారికి వొంట్లో బాగోలేదు సూరమ్మా !" అన్నది సత్యవతి. ఈమాత్రం మాట తనభర్తకూడా అని వుంటాడన్న నమ్మకంతో.

"ఏమయింది బాబూ?" అన్నది సూరమ్మ.

"తెలీదు. అర్ధరాత్రివరకూ బాగానే వుంది. అప్పట్నించి వొళ్లు వెచ్చబడింది."

"డాక్టరుకు చూపించరేంటండీ?" అన్నది సూరమ్మ.

"నేను చూపించేదేమిటి! ఆయన ఆరోగ్యం సంగతి ఆయనకు తెలీదా! ప్రతిదీ నేను చెప్పాలిసిందేనా? దిక్కుమాలిన పనులన్నీ చేసుకోవడమెందుకు? రాత్రులకు రాత్రులంతా జాగారం చెయ్యడమెందుకు? జ్వరాలు పడటమెందుకు ఎవరి మెప్పుకోసమట, ఈ వెధవంతా?" అన్నది సత్యవతి తన మామూలు ధోరణిలో.

తనకుగాని పిచ్చెత్తిందేమోనని సూరమ్మ కనుమానం వేసింది.

"ఏమిటి బాబూ మీరనేది అమ్మగారు ఉద్యోగం యాడచేస్తున్నారండీ! అసలు మీకే వొంట్లో బాగా లేనట్టుంది బాబుగారూ!" అన్నది సూరమ్మ.

తను చేసిన పొరపాటేమిటో సత్యవతికి తెలిసిపోయింది.

"భగవంతుడా! ఎన్నిగొడవలు తెచ్చిపెట్టావయ్యా!" అని తలబాదుకొంది సత్యవతి.

సూరమ్మ చేతులు పిసుక్కొంది. మెల్లగా సత్యవతి రెక్కపట్టుకొని "నడవండి బాబూ! మీకు వొంట్లో బావో లేదు. ఆదినుంచీ చూస్తున్నాను. అన్నీ ఆడంగిమాటలు మాట్లాడతావుండారు. ఆడంగిపనులు చేస్తావుండారు. జరంత సేపు కూకోండి నేను డాక్టరుగార్ని తోలుకొస్తా" అన్నది సూరమ్మ.

"ఒద్దులేవే పిచ్చిముండా! చెబుతుంటే వినిపించు కోవేం! కాస్త పైత్యం చేసినట్టుంది. అందుకే మాటలు తడబడుతున్నాయి. కరేపాకు చెట్టుదగ్గర అల్లంముక్క ఉండాలిగదా? కాస్త నూరి రసం తీసిపెట్టు" అన్నది సత్యవతి.

సూరమ్మలో చిన్నపాటి సంక్షోభం ప్రారంభమయిం దనుకోవచ్చు. ఎందుకంటే, ఏనాడూ తనతో పట్టుమని పది నిమిషాలయినా మాట్లాడి ఎరగని శంకరంగారు, ఎంతో పరిచయం ఉన్నవాడిలా మాట్లాడుతున్నాడు. అదీగాక, అమ్మగారు ఎలా అంటారో, అదే ధోరణిలో అంటున్నాడు. ఏసంగతి పట్టించుకోనట్లు కనిపిస్తాడుగానీ, నిజంగా ఆయనకన్ని విషయాలు తెలుసుననిపిస్తున్నది. ఎలా అంట్లుపోగెయ్యాలో, ఎలా ఊడవాలో తెలుసు. స్టౌకి కిరసనాయిల్ కొట్టడం తెలుసు. ఏ వస్తువు ఎక్కడుండేదీ తెలుసు. మట్టి అల్లం ముక్కెంత? దాని బిసాదెంత? దాన్ని నిన్నమధ్యాహ్నమే అమ్మగారు కరేపాకుపాదులో దాచారు. ఆ సంగతికూడా అయ్యగారికి తెలుసు. అయితే మరి అమ్మగారు, ఆయనకు ఇంటిసంగతి బొత్తిగా తెలియదంటుండేం?

సూరమ్మకు ఈసంగతేదో అయోమయంగా తోచింది. నిజంగా సత్యవతికి జబ్బు చేయలేదనీ, అయ్యగారిని ఏడిపించేందుగ్గాను, ఇటువంటి దొంగవేషాలేస్తోందని దాని కను మానం కలిగింది. అయ్యగారిని ఉబకేసి రొల్లుకోవడానికి ఇదే తగిన సమయమనికూడా సూరమ్మ అనుకొంది. మెల్లగా అడుగులో అడుగు వేసుకొంటూ వంటింటి గుమ్మంవద్దర కొచ్చింది.

ఆసరికే సత్యవతి కత్తిపీటముందుకూచుని, వంకాయల ముక్కలు తరిగి దబ్బరగిన్నెలో వేస్తూవుంది. స్టౌమీద డికాక్షన్ కోసం నీరు మరుగుతూ ఉంది. పక్కనే చేటలో బియ్యం ఉన్నాయి. సూరమ్మ ఏదో చెబుదామనుకొంటోంది. సత్యవతి తలెత్తకుండానే, "బియ్యం కడుక్కురావే!" అన్నది.

"తెస్తానులెండి బాబుగారూ! వంగముక్కల్ని జర్రంత ఉప్పునీళ్లో యెయ్యాలండి! ఆ ముచ్చట యాదకి లేకపోతే కంద్రెక్కిపోతాయండీ!" అన్నది సూరమ్మ మెహార్బానీ కనపరుస్తూ.

"పసిదానికి చెప్పినట్లు నాకు చెబుతావేమిటే! నాకు వంటకూడా రాదనుకొంటున్నావా ఏమిటే భడవాముండా! ఎప్పుడన్నా సమయంచూసి, మీ అయ్యగారిదగ్గర యీ ముక్కనరాదా, నన్ను మెచ్చుకొని మేకతోలు కప్పుతారు గదా!" అన్నది సత్యవతి.

"అయ్యగారుంటే, ఇంకోరెవరున్నారు బాబుగారూ!" అన్నది సూరమ్మ బిడియపడుతూ.

సత్యవతి తేలుకుట్టినట్లు ఉలిక్కిపడింది ఆ వెంటనే సుదీర్ఘంగా నిట్టూర్చింది. ఓ క్షణం తనచుట్టూ చూసింది. తనను తాను చూసుకొంది. మోకాళ్ళదాకా మడతపడిన లుంగీ, శాండో బనీను, ముందుగా కత్తిపీట, కోసిన వంకాయముక్కలు, చేటలో బియ్యం కనిపించాయి ఇప్పటి కప్పుడే, తను నాలుగైదుసార్లు బైటపడిపోయింది. తెల్లిళి తక్కువ దిష్టమ్మగనక సూరమ్మ కనిపెట్టలేకపోయిందిగానీ,

అదే యింకొకరయితే నానా రభసా జరిగివుండును. ఇకనుం డైనా జాగ్రత్తగా వుండటం చాలా అవసరం!

ఈ నిశ్చయానికొచ్చాక సత్యవతి ఛటుక్కున లేచింది. సూరమ్మను రాచుకొంటూ వెళ్ళి హాల్లోని కుర్చీలో కూచుంది. తన భర్త ఎలా ప్రవర్తిస్తాడో జ్ఞాపకం తెచ్చుకొంది. మామూలుగా ఆ వేళప్పుడు శంకరం యేం చేస్తుంటాడు? పొద్దెక్కేకగాని లేవడు. లేచాక కళ్లు నులుముకుంటూనే స్టూలు పైకి చేతిని పోనిస్తాడు. సిగరెట్లు, అగ్గిపెట్టె అందుకొంటాడు. బద్ధకంగా సిగరెట్ వెలిగించి బాత్‌రూం కెడతాడు. ఆయన వచ్చేసరికి తను బ్రష్షూ, పేస్టూ సిద్ధంగా వుంచుతుంది. పళ్లు తోముకొనేసరికి కాఫీ సిద్ధం. ఈలోగా మరో రెండు సిగరెట్లు కాలుస్తాడు బుద్ధిపుడితే యింకోసారి కాఫీ తాగుతాడు. కాస్సేపు ఆదరాబాదరా పేపరు తిరగేస్తాడు. చన్నీళ్లు నెత్తిన దిమ్మరించుకొని వళ్ళు తుడుచుకొంటూనే అన్నంకోసం గంతు లేస్తాడు. సాధారణంగా విసుగ్గానూ, పరధ్యానంగానూ వుంటాడు. పులుసన్నం తింటూనే పెరుగు వడ్డించుకొంటాడు. మంచినీళ్ళకు బదులు చారు తాగేసి, మజ్జిగతో చేతులు కడుక్కొన్న సందర్భాలు చాలా వున్నాయి. ఆదరాబాదరా గుడ్డలు వేసుకొని ఆఫీసుకు వెళ్ళిపోతాడు. ఆలస్యంగా యింటికొస్తాడు. చిరాగ్గావుంటే పోట్లాడతాడు లేదా నిద్రపోతాడు. పోతాడని తను అనుకొంటోంది. కాని, యెప్పుడూ మెలుకువతోనే వుంటాడని తన అనుమానం. అనేకసార్లు రాత్రులు మేలుకొని వుండటం తనకు తెలుసు. విధిపోరామం లేకుండా సిగరెట్లు కాల్చడం ఆయనకు నిత్యనైమిత్తికాల్లో ఒకటి.

అవసరంకొద్దీ జ్ఞాపకం చేసుకొన్న ఈ విషయాలన్నీ కళ్ళముందు కనిపించగానే, సత్యవతి మనస్సు క్షోభించి పోయింది. అప్రయత్నంగా కళ్లు నీటితో నిండిపోయాయి. అల వాటు ప్రకారం పమిటచెంగుతో కళ్లు తుడుచుకోబోయింది. కానీ ఎడంభుజం బోసిగా కనిపించింది. ఛటుక్కున ఎదు ర్రొమ్మును చూసుకొంది. ఉంగరాలు తిరిగి నల్లని వెంట్రు కలు మెడకింద కనిపించాయి. సత్యవతి బరువుగానిట్టూర్చింది.

"ఎందుకిలా వచ్చిందో వచ్చింది. దీని సంగతేమిటో తేల్చుకోవడమే మంచిది!" అనుకొన్న దావిడ.

అలా తేల్చుకోకుండా తను చేయగలిగింది మాత్రం ఏమున్నదో సత్యవతికి తెలీదు.

"ఈ అలవాట్లన్నీ పొల్లుపోకుండా చూసుకోవాలి. ఎక్కడా ఎవరికీ అనుమానం తగలకూడదు. నాలుగైదు రోజులపాటు కాస్త కొత్తగా వుంటుంది. తరవాత అదే మామూలయిపోతుంది" అనుకొన్న దావిడ. ఈ క్షణంనుండే ప్రారంభించాలనికూడా నిశ్చయించుకొంది.

ఈ పథకం ప్రకారం ఈ క్షణంనుండీ తను వంటపని చేయకూడదు. పనిమనిషితో చనువుగా ఉండకూడదు. తను దానితో అన్న మాటలన్నీ, అననట్లుగా నటించాలి. సుభద్ర కిచ్చిన యాభై రూపాయల చేబదులూ అడక్కూడదు. నాగ రత్నం పిన్నితో పూసుకుతిరగ్గూడదు. రమణితో కలిసి, చలం గారి పుస్తకాలను చదవకూడదు. చర్చించకూడదు ... ఈవిధంగా లెక్క వేసుకొంటూ పోయేసరికి, సత్యవతిలో చిన్నసైజు భయం అంకురించింది. పొరబాటున తనివ్వన్నీ

ఎప్పుడైనా చేస్తే కొంపలంటుకొంటాయి. చెయ్యవలసినవి చేయకపోయినా కొంపలంటుకొంటాయి, ఎంతో జాగ్రత్తగా ఉంటేతప్ప. కొంపలంటుకోవడమన్నది తప్పదేమో ననిపించింది సత్యవతికి !

సూరమ్మ బియ్యంగాలించి వాకిటిను ఉదు పెట్టింది. స్టౌమీది డికాక్షన్ విరులెత్తి మాడిపోయిన వాసన కొడుతోంది. సగం వంకాయలు నట్టింట అలానే వున్నాయి.

"పోనీ ఈపూట నేను ఎసట్లో ఇన్ని గింజలెయ్యనా బాబుగారూ!" అన్నది సూరమ్మ.

"ఎందుకే నిన్ను తగలెయ్య! నేను వండుకోలేనా? ఈ వంకతో జీతం పెంచమని అడుగుదామనా నీ ప్లాను !" అనేది సత్యవతి మామూలుగా. అయితే, ఇప్పుడలా అనేందుకు వీల్లేదాయె! అంటే సూరమ్మమండ పసికడుతుందాయె! ఇప్పటికే తను నాలుగైదుసార్లు నోరు జారివుండె! కొంపలంటుకోవడాని కింతకంటె మరేం కావాలట ?

"వద్దులే సూరమ్మ! నువ్వెళ్లు ఆ పనేదో ఆయన గారుచూస్తారే!" అన్నది సత్యవతి.

"ఆయన గారెవరు బాటయ్యా !"

సత్యవతి రెండు కణతలూ పట్టుకొని, కళ్లు మూసుకొంది.

"నాకు వంట్లో బావోలేదు సూరమ్మా! తలంతా నాదుగావుంది !" అన్నది సత్యవతి.

"డాక్టరుగారిని పిలిపియ్యమంటారా బాబూ !" అన్నది సూరమ్మ.

"అదేదో నేను చూసుకొంటాలే! టైమయినట్లుంది నువ్వెళ్లు పాపం!" అన్నది సత్యవతి.

మామూలుగా అయితే సూరమ్మ యిప్పటివాకా కూడా వుండదు. ఆదరా బాదరా పనులన్నీ చేసేసి, ముని గాళ్ళమీాద ప్రయాణం పెట్టుకొని కూచుంటుంది. ఇవ్వాళ దాని వుద్దేశ్యం అదికాదు. అయ్యగారితో నాలుగు మంచి మాటలు మాట్లాడి, డబ్బుపుచ్చుకొందామని అనుకొంది. సాధారణంగా ఆడవాళ్ళకన్నా మగవాళ్ళు డబ్బు విష యంలో నిర్లక్ష్యంగా వుంటారని దానికి తెలుసు.

"టైం దేముందిలే బాబూ! మీారిట్లా వుంటే పోవ డానికి కాళ్ళే రావటంలేదు గదండీ! మీారెట్లా పొమ్మంటారు? అన్నా నేనెట్లా పోతనుండీ?" అన్నది సూరమ్మ

"ఓసి భడవాముండా! ఎన్ని హొయలు పోతు న్నావే?" అనుకొంది సత్యవతి. కానీ ఆమాట పైకిఅనడానికి లేదు. ఏదోవిధంగా సూరమ్మను సాగనంపడం చాలా అవసరం. ఈముండ యిక్కడే వున్నాకొందికి ప్రమాదం జాస్తవుతుంది. అందుకని 'ఫర్వాలేదు వెళ్ళ' మంది సత్యవతి.

సూరమ్మ కేం చెయ్యడానికీ పాలుపోలేదు. ఈలోగా అమ్మగారికి సుస్తీ తగ్గుతుందేమోనని, అప్పుడు అయ్యగారికి మస్కా వెయ్యడానికి అవకాశం చిక్కదేమోననీ దాని భయం. కానీ యీ అయ్యగారు కంపనా, కట్టైనా కాల కుండా వున్నారు.

"సరే బాబూ! మరి నే వెడతాను మీాకీపూట కాఫీ

కూడా లేనట్టుగా వుండది. బజార్నుంచి తెమ్మంటారా?” అన్నది సూరమ్మ.

‘వద్దు’ అన్నట్టుగా తల తిప్పింది సత్యవతి.

సూరమ్మ మనస్సులోనే తిట్టుకొంది. అది పోవడానికి వెనక్కు తిరిగి నాలు గడుగులు వేసిందో లేదో, ఓ గావుకేక పెట్టి ఛటుక్కున వెనక్కు దూకింది. సత్యవతికూడా వులిక్కిపడి అటుకేసి చూసింది. శంకరం కనిపించాడు. తనకు తాను ఏ నడివీధిలోనో ఎదురుపడినప్పుడు కలిగే విచిత్రభావం సత్యవతికి కలిగింది. తనెలా వుంటుందో, యెలా యితరులకు కనిపిస్తుందో, చాలా స్పష్టంగా చూడగలిగిన అవకాశం సత్యవతి కిప్పుడు కలిగింది. గబగబా శంకరం దగ్గరకెళ్ళి, అతని చెవిలో ఏదో చెప్పింది. శంకరంవులిక్కిపడి చూట్టూ ఓసారి చూసి ఛటుక్కున చేతిలోని సిగరెట్టను పారేశాడు.

“ఇక నువ్వెళ్ళు సూరమ్మ! ఆవిడ లేచిందిగా యింటి పనులు చూసుకొంటుందిలే! పో పాపం!” అంటూనే సత్యవతి పనిమనిషిని సాగనంపి, తలుపుకు గడియపెట్టి ఓ పెద్ద నిట్టూర్పు విడిచింది.

సత్యవతి అనుభవాలను గురించి మనం యిప్పటివరకూ చెప్పుకొంటున్నాం. శంకరంకూడా యిలాంటి అనుభవాలకే గురయ్యాడు. అతగాడికి ఆలస్యంగా లేవడం అలవాటు. సత్యవతి మాటల్లో చెప్పాలంటే చిరాకుతో నిద్రపోతాడు. విసుగ్గా లేస్తాడు. లేస్తూనే కసురుకొంటాడు. దానికో కారణమంటూ వుండదు. హాజరుగా వేళ్ళోళ్ళు వున్నందుకూ కేకలు పెట్టడం, లేనందుకూ కేకలు పెట్టడం ఆయనకు సహజగుణ

మనీ, దానికి కారణాలు వెతుకుతూ కూచోవడం అవసరమనీ సత్యవతి ఓ నిర్ణయానికి వచ్చింది. అలావచ్చాక ఆవిడకు కొంత ఊపిరాడుతూన్నట్టుగా ఉన్నది.

రోజులాగానే ఆరోజునా శంకరం లేచాడు. కానీ మామూలుగా విసుక్కోలేదు. గత రాత్రి - రోజుకన్నా హాయిగా నిద్రపోయాడు. అతని మనస్సులో ఉసుళ్ళపుట్ట బద్దలవలేదు. తనకూ సత్యవతికీ మధ్యగల మాయతెరలు తొలగిపోతున్నాయని, తమ జీవితంలో వెనకటి ఆసక్తి, రుచి, తిరిగి ఏర్పడతాయనీ, అతననుకొన్నాడు. చాలాసేపు ఈఆలోచనలతోనే అతను గడిపాడు. బహుశా యిదే కారణం కావచ్చు. శంకరం ఆలస్యంగాలేచినా కేకలు పెట్టలేదు.

లేస్తూనే స్టూలుమీదికి చెయ్యిచాపాడు. సిగరెట్లు, అగ్గిపెట్టా చేతికందాయి. పూర్తిగా కళ్ళు తెరవకుండానే వాటనందుకొన్నాడు. సిగరెట్ పెదవులమధ్య బిగించి అగ్గిపుల్ల గీశాడు. ఆ ఉదుటుకు గాజులు గల్లుమని చప్పుడు చేశాయి. అప్పటికి అతను పూర్తిగా మేలుకోలేదు.

పక్కమీదనే బాసీపట్టువేసి కూచుని, దిండ్లన్నీ కాళ్ళమీద పేర్చుకొని, వాటిమీద మోచేతులానించి, ఆ చేతుల చివరగడ్డం మోపెట్టి సిగరెట్ కాలుస్తున్నాడు. శంకరం చాలారోజుల తరువాత ఇంత ప్రశాంతంగా అతనున్నది ఈరోజుననే! గట్టిగా పొగలాగి, సిగరెట్ నుసిరాల్చుతున్నప్పుడు, మరోసారి గాజులు చప్పుడు చేశాయి. ఈసారి అతన్నెవరో చరిచినట్లనిపించింది. చుట్టూ ఓసారి చూశాడు.

సత్యవతి ఎక్కడా లేదు. వంటింట్లో గిన్నెల చప్పుడవుతోంది. మరి ఈ గాజుల చప్పు డెక్కడిదట ?

శంకరం దాన్నిగురించి ఆలోచించ దలచుకోలేదు. అంతకన్నా ముఖ్యమయింది — రాత్రి అనుకోనివిధంగా తమ మధ్యజరిగిన సంఘటన యిటువంటి పరిస్థితి వస్తుందని శంకరం అనుకోలేదు. సత్యవతి అనుకొన్నదో లేదో అతనికి తెలీదు. ఏది ఏమైతేనేంగానీ, తమిద్దరి మధ్యాగల లొసుగులన్నీ పూడిపోతే — బ్రతుకు హాయిగా ఉంటుంది. ఇదివరకు అనేకసార్లు తను డబ్బుఉంటే అన్ని సుఖాలు వుంటాయనుకున్నాడు. కాని, డబ్బుసాధించలేని సుఖాలు ఈప్రపంచంలో అనేకమున్నాయని ఇప్పుడు అనుభవ పూర్వకంగా తెలుసుకొన్నాడు.

అనవసరంగా ఓసారి ఆవలించి, చేతులు రెండూ పైకి చాపి, వేళ్లు కలిపి, మెటికలు విరుచుకొన్నాడు శంకరం. ఈసారి మళ్ళ చెవలపక్కనే గాజుల చప్పుడు వినిపించింది. మంచంమీాదినుండి లేచాడు. లుంగీని మోకాళ్ళపైకి మడుచుకొందుగ్గాను, కుడికాలు వెనగ్గావేసి, లుంగీ అంచుకోసం చెయ్యిచాపాడు. లుంగీకి బదులు నీలిరంగు అంచున్న తెల్లచీర కనిపించింది. కొరడాతో బాదినట్టు వులిక్కిపడ్డాడు శంకరం. ఓసారి తనను తాను చూసుకున్నాడు. చేతులకు గాజు లున్నాయి. ఎడంచేతి చిటికెనవేలికి నీలంరాయి వుంగరం వుంది. మెళ్లో సన్నని గోవర్ధన గొలుసు, రెండుపేటల రాళ్ళ నెక్లెసూ వున్నాయి. అందమైన వుంగరాల క్రాపు బదులు పిరుదలదాకా వేళ్ళాడే జడ కనిపించింది. అప్రయ

త్నంగా అతని చేతులు గుండెలమీాది కెళ్ళాయి. సత్యవతి ఎదురొమ్ము జ్ఞాపకం వచ్చింది.

శంకరం నిలబడలేక పోయాడు. అతని కాళ్ళల్లో వణుకు ప్రారంభ మయింది. తిమ్మిరిబట్టిన కాళ్ళను ఈడ్చుకొంటూ నడిచినట్లుగా నడిచి, దగ్గరలో ఉన్న కుర్చీలో కూచున్నాడు. చేతిగాజులు మరోసారి గొల్లుమని నవ్వాయి.

రాత్రి సరదాగా తామనుకున్న మాటలు నిజమవుతాయని శంకరం అనుకోలేదు. అయినా అవి నిజమయి కూచున్నాయి. తను కాస్తా సత్యవతిగా మారిపోయాడు. అంటే ఈసరికే సత్యకూడా శంకరంగా మారి ఉండాలన్న మాట. ఈమార్పును గురించి శంకరం సంతోషించాడో పశ్చాత్తాపడ్డాడో మనం ఖచ్చితంగా చెప్పలేం ! ఎందువల్లనంటే, ఆక్షణాన అతనిలో ఈ రెండు రకాల ప్రవృత్తులూ పనిచేశాయి.

"మంచికో చెడ్డకో ఈ మార్పు లొచ్చాయి. ఇదీ కొంతకాలం అనుభవిద్దాం" అనుకొన్నాడు శంకరం,

దీన్ని బట్టిచూస్తే అతనికిమార్పు అంత రుచించినట్లుగా లేదని, ఎవరికయినా అర్థమవుతుంది. కాని గతరాత్రి అతనిలా అనుకోలేదని మనకు తెలుసు. ఇటువంటి మార్పంటూ జరగాలేగానీ, తనకన్నా సతోషించేవారు లేరన్నధోరణిలో సత్యవతితో మాట్లాడాడు. తీరా అనుకొన్నది కాస్త జరిగాక. ఇప్పుడింకోలా అనుకొంటున్నాడు. మానవస్వభావమే అటువంటిది

తొలిసారిగా అతనెదుర్కొన్న యిబ్బంది ఆర్థుగజ్జాల

కరిమింగిన వెలగపండు

చీరెను మోయడం చాలామంది ఐదు గజాల చీరలే కడ తారట గానీ, సత్యవతి మాత్రం ఖచ్చితంగా ఆరు గజాల చీరెనే కడుతుంది. అదిగాక లోపల లంగా ఒకటి వేసు కొంటుంది. ఈ రెండూ అనవసరమని శంకరం అనేకసార్లు అనుకొన్నాడు. ఒకటి రెండుసార్లు – బాగావున్న రోజుల్లో – సత్యవతితో అన్నాడు కూడా.

"మీా కేం నష్టముట?" అన్నది సత్యవతి నవ్వుతూ.

"బోలెడంత టైం దండుగ గదుటోయ్!" అన్నాడు శంకరం కూడా నవ్వి.

ఆ మాటలన్నీ యిప్పుడు జ్ఞాపకంవచ్చి నిట్టూర్పు విడిచాడు.

"చచ్చినట్టు ప్రతిరోజూ నే నివి కట్టుకోవాలి గావును" అనుకొన్నాడు శంకరం.

తనను స్త్రీగా భావించుకొని ఆ యింట్లో తను చెయ్య వలసిన పనులన్నీ జ్ఞాపకం చేసుకొన్నాడు. ఏదో నాట కంలో వేషం వేయబోయేవాడికి కలిగే ఆలోచనలన్నీ అతనికి కలిగాయి.

శంకరం మరో సిగరెట్టు అంటించాడు. లేచి బాత్ రూం కేసి వెడుతున్నాడు గాలికి పమిటచెంగంతా జారి కింద పడింది దాన్ని తీసి తుండుగుడ్డ భుజాన వేసుకొన్నట్టు వేసు కొన్నాడు. రొమ్ములమీాద యెలాంటి అచ్ఛాదనా లేదు.

స్నానం చేస్తున్నప్పుడు శంకరానికి అంతా కొత్తగా కనిపించింది. అతను తుండు మొలకు చుట్టుకొని కుండీలోంచి చన్నీళ్ళు నెత్తిమీాద దిమ్మరించుకొన్నాడు. వంగినప్పుడు

జడ భుజంమీదుగా కిందికిజారింది. ఆ సరికే నీళ్ళు నెత్తి మీదికి పడిపోయాయి.

"చచ్చాంఫో. ఈ దిక్కుమాలిన మార్పిడివల్ల, నెత్తి మీద నీళ్ళు పోసుకునేందుకూడా వీల్లేదు. ప్రతిరోజూ,ఇంత జుట్టును చన్నీటితో తడిపితే, నిమోనియాతో చావాలి" అనుకొన్నాడతను.

పొడవాంటి జడలున్న ఆడవాళ్ళు నీళ్ళెలా పోసుకొంటారో అతనికి తెలీదు. వీపుమీద దిమ్మరించుకొన్నా జడ తడుస్తుందిగదా! పోనీ సత్యవతిని పిలిచి అడుగుదామా అనుకొన్నాడు. అడిగితే చెబుతుంది కానీ, అలా అడిగేందుకు మనసొప్పలేదు. చెంబును నీళ్ళకుండీలోపడేసి, జడను, చుట్ట చుట్టాడు. ముచ్చిలి గుంటదాకా అలా చుట్టుకొంటూ వచ్చాడు. ఆ తరవాత దాన్నేంచేయాలో తోచలేదు. విడిచి పెడితే వ్యవహారం మళ్ళా మొదటికొస్తుంది. పట్టుకొంటే నీళ్ళుపోసుకోవడానికి వీల్లేదు. శంకరానికేమీ పాలుపోలేదు. ఓ చేత్తో జడచుట్టను అలాగే పట్టుకుని, మరోచేత్తో నీళ్ళు పోసుకొన్నాడు. వొళ్ళు రుద్దుకునేందుకు వీలులేక పోయింది.

ఏదో అయిందనిపించేశాడు. వొళ్ళు తుడుచుకొన్నాడు. ఇంకో సిగరెట్ అంటించాడు. తలుపు తీసుకొని బయటికొచ్చేశాడు. సరిగ్గా ఆ సమయానికే సూరమ్మ యింటికెళుతూవుంది. తుండు కట్టుకొని సిగరెట్ కాలుస్తున్న శంకరాన్ని చూసి కెవ్వుమని ఆర్తనాదం చేసింది! ఏ ఆడదయినా, తుండుగుడ్డ మొలకు చుట్టుకొని ఒంటిమీద యేమీ

లేకుండా, సిగరెట్ కాలుస్తూ, హృదయం యెనిమిదిగంటలవేళ వరండాలో కొస్తుందా? అలావస్తే మీ్రారుమాత్రం దిమ్మెర పోతారా పోరా? సూరమ్మ ఆర్తనాదం చేసిందంటే తప్పే ముంది?

సత్యవతి తెలివిగా సూరమ్మను పంపించింది గానీ, లేకపోతే చాలా రభస జరిగివుండేది. శంకరానికయినా, సూరమ్మ ఆర్తనాదం విన్న తరువాతగానీ స్పృహరాలేదు. అప్పటికంతా చేయిదాటి పోనేపోయింది. ఏమనుకున్నామాత్రం ఏం ప్రయోజనం?

"ఏమిటిదంతా సత్యా?" అన్నాడు శంకరం, కుర్చీలో కూర్చుని.

సత్యవతి, ఓసారి కళ్ళురెండూ గట్టిగా నులుముకొని వేళ్ళమెటికలు విరుచుకొని, సన్నగా నిట్టూర్చింది.

"మాట్లాడవేమిటోయ్!" అన్నాడు శంకరం, సిగరెట్ నుసి సుతారంగా కొనగోటితో దులుపుతూ.

"ముందు మీ్రా సిగరెట్ ఆర్పేయండి. అంతకన్నా ముందు గదిలోకి పదండి! ఆ తరువాత అన్ని సంగతులూ చెబుతాను!" అన్నది సత్యవతి

శంకరం, చాలా చిత్రంగా చూశాడు. తనలోతనే మాట్లాడుతున్న అనుభూతి అతనికి కలిగింది. బహుశా తొలిసారిగా తను నటించిన సినిమాను చూస్తున్నప్పుడు, నటుడికి కూడా ఇలాంటిఅనుభూతే కలుగుతుందనుకున్నాడు శంకరం.

"నిన్ను చూస్తుంటే సత్యం——"

"ఇశ్శో! ఎవరన్నా చూస్తే యెంతపరువు తక్కువ!

అదృష్టవశాత్తు చుట్టుపక్కలవారింకా మనకేసి చూడలేదు” అన్నది సత్యవతి యేదో రహస్యం చెబుతున్నదిలాగా.

“చూస్తే కొంపలంటుకుంటాయా? తలతీసి మొలేస్తారా? మొగుడూ పెళ్ళాం అన్న తరవాత, వరండాలో నిలబడి మాట్లాడుకోవడంకూడా తప్పని నాకింకా తెలియదే!” అన్నాడు శంకరం, గొంతు కాస్త హెచ్చించి.

“నాఖర్మం!” అని తలబాదుకొంది సత్యవతి చిరాగ్గా. ఆ వెంటనే సన్నగా నవ్వింది కూడా.

“మాట్లాడుకోవచ్చుగానీ, మనమిప్పుడు వెనకటి మనుషులం కాదు. నేను శంకరాన్ని మీ భార్యను. మీరు సత్యవతి. నాభార్య” అన్నది సత్యవతి సన్నగా నవ్వుతూనే!

శంకరం పగలబడి నవ్వాడు.

“నీ తెలివి తెల్లారినట్టేవుంది. నేను శంకరాన్ని. మీ భార్యను. ఏమిటి నీ తలకాయ్. శంకరం వరకూ సరే! మీ భార్యనేమిటి? ఆ మాట అనవలసిన వాణ్ణి నేను మాటల్లో పొరసందులో స్తే యెలా?” అన్నాడతను నవ్వి.

“మీరు మాత్రం సాధించిందేమిటి గనుక? ఆమాట అనవలసినవాణ్ణి నేను అంటారేం? ఇంకా వాడెక్కడున్నాడండీ!” అన్నది సత్యవతి.

నువ్వు తెలివిగలదానివనుకొంటున్నావుగాని, లాభం లేదోయ్! భార్యను పట్టుకుని యెక్కడైనా ‘మీరు’ అంటారామరి?

“అనరుగాని మొగుణ్ని ‘ఏమోయ్’ అనిపిలిచే ఆడది వుంటుందంటారా?” అన్నది సత్యవతి.

" మళ్ళా నువ్వు 'రా!' చేర్చావు అమ్మాయీ, యిదేదో చాలా గొడవలు తెచ్చేట్టుగా వుంది. ముందు నాకు కాఫీ కావాలి, తెచ్చిపెట్టు" అన్నాడు శంకరం కుర్చీలోంచి లేచి లోపలి కెడుతూ.

సత్యవతి అటుకేసి చూసింది. తను నడుస్తుంటే అందంగా వుంటుందని చాలామంది అన్నారు. ఆ అంద మేమిటో తనకు తెలిదు. ఇప్పుడు శంకరం నడుస్తుంటే మొట్టమొదటిసారిగా చూసి తన్మయురాలయింది సత్యవతి. తూచితూచి అడుగులు వేస్తున్నప్పుడు అందంగా కదిలేజఘన భాగం సత్యవతిని ముగ్ధురాలిని చేసింది.

గదిలోకొచ్చాక శంకరం తల దువ్వుకోడానికి అద్దం ముందు నిలబడ్డాడు. యే ఆచ్ఛాదనాలేని శరీరాన్ని చూసి సిగ్గుపడ్డాడు. తొలి రోజుల్లో—సత్యవతిని యీ స్థితిలో చూసి అతను వెర్రెత్తిపోయిన సందర్భాలు జ్ఞాపకంవచ్చాయి. కన్నార్పకుండా అద్దంలోని బొమ్మకేసి చూశాడు. కళ్లు అటూ యిటూ తిప్పాడు. చేతులు కదిలించాడు. భుజాలు కదిపాడు, గాజులు పైకి, కిందికీ జరిపాడు. నున్నగావున్న చెక్కిళ్ళను సున్నితంగా వేళ్ళతో నిమిరాడు. ఆఖరుకు బొమ్మను ముద్దుపెట్టుకున్నాడు.

"ఏమిటా పని ?" అన్నది సత్యవతి లోపలి కొస్తూ. శంకరం కాస్తంత సిగ్గుపడినటువంటివాడయ్యాడు.

"మరేం లేదు సత్యా! అద్దంలో నన్ను చూసుకొంటుంటే మన పాత రోజులు జ్ఞాపకంవచ్చాయి. నీకు గుర్తుందో లేదో—ఓ ఉగాదిపండుగ రోజున మనం మేడమీద గదిలో

పండుకొన్నాం. నువ్వేమో రాత్రి పది గంటలదాకా విన్నా అమ్మతో బాతాఖానీ కొడుతూ కూచున్నావు. నేను పెంద రాడే పైకొచ్చాను. నువ్వెంతకీ రాలేదు. పాడిదగ్గు దగ్గాను, మంచినీళ్లు కావాలని కేకపెట్టాను. బన్నీను కని పించలేదన్నాన. అన్నీ పనిమనిషిచేత పంపించావుగానీ, నువ్వుమాత్రం రాలేదు...”

సత్యవతి సిగ్గుపడిపోయింది. తలవంచుకొంది. మగ వాడు సిగ్గుపడి ఆడదానిలా తలొంచుకొంటేనూ, ముసిముసి నవ్వులు నవ్వితేనూ యేమంత అందంగావుండేదుస్తుందిగనక! సత్యవతి సిగ్గుపడినా యిప్పుడలానే వుంది.

ఆరాత్రి యేంజరిగిందో శంకరం చెప్పవలసిన అవసరం లేదు. సత్యవతికి బాగా జ్ఞాపకం వుంది. తొందరగా వెళ్ళా లని ఆవిడకూ మనస్సులో వుంది. ఉందిగదాయని దీపాలు పెట్టీపెట్టకముందే గదుల్లో దూరి బిడాయించుకొంటే యెలా? అమ్మ యేమన్నా అనుకోవచ్చు. అంతకన్న ముఖ్యం లలిత వదిన ప్రాణాలు తీసేస్తుంది! అందుకనే తాత్సారంచేసింది. ఓ చెంపనించి శంకరం మేడమీదినుండి పొడిదగ్గులు దగ్గు తుంటే, మరోపక్కనుండి సూర్యం అన్నయ్య పుస్తకాలను పెద్దగా చప్పుడు చెయ్యసాగాడు.

“వస్తానోయ్ వదినా! మోర్సుకోడ్ ప్రారంభ మయింది” అన్నది లలిత కింది పెదవి బిగబట్టి నవ్వును ఆపుకొంటూ.

“పడుకోమ్మా. వెళు, జాగ్రత్తగా గడియపెట్టుకో !” అంటూనే అమ్మ కూడా వెళ్ళిపోయింది.

తను పైకి వచ్చేసరికి శంకరం నిద్రపోతున్నాడు. అది దొంగనిద్రని తనకూ తెలుసు. అయినా చూదామని అతన్ని లేపింది. శంకరం మాంచినిద్రలో వున్నవాడిలాగా మూలిగి అటుతిరిగి పడుకొన్నాడు. తను కింద చిరిచాప వేసుకొని పడుకొంది. రెండు నిమిషాలయినా కాకముందే శంకరం పక్కనే చేరి ఆవిడను కావిలించుకొని తనవేపుకు తిప్పుకొన్నాడు. బంగారంవంటి చీర నిద్రలో నలిగిపోతుందన్నాడు. మడతలు మళ్లా కుదరవన్నాడు. నలిగిన చీరె కట్టుకొంటే అసహ్యంగా వుంటుందన్నాడు. చెప్పినమాట వినకపోతే తనన్నా చీరె విషయంలో జాగ్రత్తపడక తప్పదన్నాడు. ఆ తరవాత...

సంగతులన్నీ జ్ఞాపకంవచ్చాయి సత్యవతికి. ఆ సంఘటన యింతకుముందే జరిగినట్లు సిగ్గుతో ముడుచుకుపోయింది

"అవునుగానీ, కాఫీ యేదీ?" అన్నాడు శంకరం కుర్చీలో కూచుని కాళ్ళూపుతూ.

"అన్నట్టు మనం జ్ఞాపకం వుంచుకోవలసిన సంగతులు కొన్ని వున్నాయి. నే నెప్పుడూ అలా కుర్చీలో కూచొని కాళ్ళూపను, ముందు మీరా అలవాటును మానుకోవాలి" అన్నది సత్యవతి తన రూపం కేసి తృప్తిగా చూసుకొంటూ.

"నాకూ భార్యను 'మీరు' అని పిలిచే అలవాటు లేదు ముందు నువ్వా అలవాటును మానుకోవాలి. పొరపాటు మీరా అలవాటును మానుకోవాలి" అని సరిదిద్దుకొన్నాడు శంకరం.

అత నింకా కాళ్ళూపుతూనే వున్నాడు. తుండుగుడ్డ మాత్రమే కట్టుకొనివున్నాడు. జడ కుర్చీమీదుగా వ్రేలాడు

తోంది. కాళ్ళకదుపుకు కుర్చీలోని శరీరం చిత్రంగా కదులు తోంది. పొట్టనిండాది ముడతలు పైకి కిందికి జరుగుతున్నాయి.

"అబ్బ! ముందుమీరు చీరె కట్టుకోండి! అలావుంటే నా ప్రాణాలన్నీ చచ్చిపోతున్నాయి" అన్నదిసత్యవతి అతనికి యెదురుగా నిలబడి.

"నాకిలా వుండటమంటే చాలా యిష్టం! ఈ సంగతి లోగడ అనేకసార్లు నీతో అన్నాను. కట్టుకుపోయినంత పేచీ పెట్టాకగానీ నువ్వు దేనికీ వొప్పుకోవు. నువ్వు బిర్రబిగిసిన కొండికీ, ఇవతలవాడి నరాలువుబికి గిలగిలలాడి చస్తుంటాడు. వాణ్ణి వీలైనంతమేరకు రెచ్చగొట్టిగానీ..." అని ఆగిపోయి నవ్వాడు శంకరం.

నవ్వినప్పుడు పొటమరించిన వొంపుల్ని చూసి, సత్య వతి లోలోపల ముురిసిపోయింది.

"కాబట్టి యేమిటంటారు?" అన్న దావిడ.

"ఏమీ అనను! నన్నిలా కాస్సేపు వుండనివ్వమం టాను. ఇదివరకు నిన్ను గంటలకొద్దీ గడ్డంపుచ్చుకు బ్రతిమి లాడవలసి వచ్చేది. ఇప్పుడు అద్దం యెదురుగా కూచుంటే_ యిష్టం వచ్చినంతసేపు చూసుకోవచ్చు" అన్నాడు శంకరం.

"ఇవతల మనిషి సిగ్గుపడుతుందనికూడా ఆలోచించ రేం?" అన్నది సత్యవతి. శంకరం యీసారి మరీ పగలబడి నవ్వాడు.

"ఇది మరీ గొడవగావుందే! నా శరీరం, నా యిష్టం వచ్చినంతసేపు చూసుకొంటాను, మూసుకొంటాను. కాదన డానికి మధ్యలో నువ్వెవరివిట?" అన్నాడు శంకరం.

సత్యవతి యేమీ మాట్లాడలేదు. ఓక్షణం ఆలోచించి మెల్లగా దగ్గరకొచ్చి అతనిగడ్డాన్ని పుచ్చుకొని, బ్రతిమి లాడింది.

"నాకి కబుర్లన్నీ గిట్టవమ్మాయ్, యికనుండీ. అంటే, మళ్ళీ మనకు మామూలు రూపాలు వచ్చినప్పటి నుండీ_ నే చెప్పినట్లు చేస్తానంటే, ఇప్పుడు నీ మాటవింటాను, లేకపోతే నా యిష్టంవచ్చినట్లు చేస్తాను" అన్నాడు శంకరం, బేరానికి దిగుతూ.

"ఓ" అన్నది సత్యవతి.

"మరి_ మాట తప్పవుగదూ !" అన్నాడు శంకరం.

"లేదు" అన్నట్లు తలతిప్పింది సత్యవతి.

"అయితే నన్నిప్పుడేం చెయ్యమంటావ్ ?" అన్నాడు శంకరం.

"బీరువాలో వాయిల్ చీరెలున్నాయి. మీాకు నచ్చి నవి కట్టకోండి. ఆ పక్క నే బాడీ, జాకెట్లు వున్నాయి, తొడుగుక్కోండి. లంగా కట్టుకోటంమాత్రం మరచిపోకండి !"

"ఈపనులన్నీ సక్రమంగా చేస్తానన్న నమ్మకం నాకు లేదు. ఈజన్మలో నాకుచీరెకట్టడం తెలీదు. తెలిసినదల్లా..." అని నవ్వాడు శంకరం.

"పోనీ నేను తెస్తాను" అన్నది సత్యవతి.

శంకరం తాపీగా సిగరెట్ వెలిగించాడు. సత్యవతి, బీరువా అంతా వెదకి మంచిచీరెను సెలెక్టు చేసింది. రో రంగు జాకెట్ తీసింది. అంచుకుట్టిన లంగాతీసింది. వచ్చేసరికి శంకరం గంపెడంత పొగ మధ్యలో వున్నాడు.

"నాకు సిగరెట్ తాగే అలవాటు లేదు. మీరిలా సిగరెట్ కాల్చకూడదు !" అన్నది సత్యవతి గుడ్డలు డ్రాయరుమీద పెడుతూ.

"పిచ్చిదానా — !" అని ఆగి నాలిక్కరచుకున్నాడు శంకరం. "నన్నలా పిలవకూడదుగదామరి! 'ఏమండీ' అనాలిగావును. అంతే పిలుస్తావు గదు టే ?" అన్నాడు శంకరం.

"నాకు మాత్రం, భర్తను అవును టే— కాదు టే అని పిలచే అలవాటు లేదు" అన్నది సత్యవతి నవ్వి.

"అవునుగదూ మరి ! నువ్వు నా భర్తవు. నేను నీ భార్యను. నేనీక్షణంనుండీ నిన్ను 'ఏమండీ !' అనాలి. నువ్వుమాత్రం, ఏమోయ్, అంటావు. మరీ ముద్దొచ్చినప్పుడు, నీకవసరం పట్టినప్పుడూ, 'సత్యా !' అంటావు. అంతేనా ?" అన్నాడు శంకరం.

"మరే !" అన్నది సత్యవతి మూతిని సున్నలా చుడుతూ.

"ఇప్పుడు చెప్పండి. నన్నేం చేయమంటారు ?" అన్నాడు శంకరం, సిగ్గును అభినయిస్తూ గడ్డంకిందకు చేతిని చేర్చి.

సత్యవతి, ఆ అభినయం చూసి, సంభాషణ చూసి పగలబడి నవ్వింది.

"నేనలా పగలబడి యెప్పుడూ నవ్వనండీ ! మీరా విషయం జ్ఞాపకం వుంచుకోవాలి" అన్నాడు శంకరం. "మీకు ఇంతకుముందే మనవిచేశాను. నాకు చీరెకట్టుకోడం కుదరదు."

"రెండుమూడు రోజులపాటు నేను కడతాను. మీరు ఈలాగా నేర్చుకోవాలి" అన్నది సత్యవతి.

"చూస్తాను !"

"అలా అంటే కుదరదు. మీకు చీరె జారినప్పుడల్లా సరిచెయ్యడాని నేను అజీలుగా వుండనుకదా నేర్చుకోక పోతే యెలా ?" అన్నది సత్యవతి

"అలాగే మీరూ పాంట్లు తొడగటం నేర్చుకోవాలి మీకావిద్య పట్టుపడేలోగా నేనిది నేర్చుకోగల ననుకొం టాను !"

సత్యవతి కళ్ళు చికిలించి, కిందిపెదవి కొరికింది.

"మరి రండి" అన్నదావిడ.

శంకరం కుర్చీలోంచి లేచాడు. సత్యవతి లంగాను మడతలు విప్పదీసి అతనికిచ్చి కట్టుకోమంది. లాగు తొడు క్కొంటున్నట్టుగా, కాళ్ళు పైకెత్తి తొడుక్కో బోయాడు.

"అలా అక్కర్లేదు. మెడమీంచి కిందికి జార్చండి !" అంటూ అలాచేసింది. ఆ తరవాత, చీరె కట్టింది. కుచ్చెళ్లు దోపుతున్నప్పుడూ, బాడీ తొడిగి, ముడివేస్తున్నప్పుడూ శంకరం గిలగిల లాడిపోయాడు. అతనికి వల్లమాలిన చక్కలి గిలి. జాకెట్టు తొడిగి, గుండీలు పెట్టింది సత్యవతి, గబగబా తలదువ్వి జడవేసింది.

"జడచివర రిబ్బను కట్టవేం ?" అన్నాడు శంకరం.

"నేను రిబ్బను కట్టుకోనే !" అన్నది సత్యవతి.

"సాయంత్రందాకా యీ జడ వూడిపోకుండా వుం

టుందా మరి ! మధ్యలో వూడిపోతే ఏంచెయ్యమంటావ్ ?" అన్నాడు శంకరం.

"ఊడదు. గట్టిగా, లోతట్టు సాయలుతీసి ముడెట్టాను. అంతగా వూడితే చివర అల్లుకోండి !" అన్నది సత్యవతి.

"చూస్తాను. కుదరకపోతేమాత్రం సాయంత్రానికి జడల మాతంగిలా తయారయి వుంటాను." అన్నాడు శంకరం.

"కుదరక ఛస్తుందా? ఇదేమన్నా బ్రహ్మవిద్యగనకనా రాకపోవడానికి ? ముందు మీరువెళ్ళి సబ్బుతో ముఖం కడుక్కురండి ! కాటుక పెడతాను." అన్నది సత్యవతి.

అన్నంతపనీ చేసింది. ముందుగా స్నో రాసి ముఖమంతా రుద్దింది. ఆ తరువాత తేలిగ్గా పౌడర్ అద్దింది. పమిటచెంగుతో, అదంతా తుడిచేశాక, సన్నగా కాటుక పెట్టింది.

"ఓసారి అద్దంలో చూచుకోండి !"

శంకరం ఎదురుగావున్న అద్దంకేసి చూశాడు. తన రూపం – సత్యవతి అవతారం – భువన మోహనంగా కనిపించింది. కన్నార్పకుండా చాలాసేపు ఆ బొమ్మకేసి చూసి, సన్నగా నిట్టూర్చాడు శంకరం.

"రోజూ నువ్విలా కనిపించవేం సత్యా ?" అన్నాడు శంకరం చాలా ఆప్యాయంగా.

సత్యవతి మనస్సు కరిగిపోయింది. అటువంటి ఆర్ద్రమైన గొంతువిని ఎంతకాలమైంది ? కళ్ళలో సన్నని నీటిజీర లేర్పడ్డాయి. అలవాటుప్రకారం పమిటచెంగుకోసం చెయ్యి

చాపి, అది లేకపోయేసరికి వేళ్ళతోనే కళ్ళు తుడుచుకొంది. శంకరం, దగ్గరగా వచ్చి నిలబడి, సత్యవతి భుజాలమీద చేతులు వేశాడు. ఆవిడ తలవంచుకుంటే తానుకూడావంచి చిన్న 'ఢిక్కీ' యిచ్చాడు. తరవాత, మెల్లగా ముఖాన్ని పైకెత్తి కళ్ళల్లోకి చూశాడు. సత్యవతి కళ్లు తెల్లగా మెరుస్తున్నాయి. "ఇప్పుడు నన్ను చూస్తే – నిజంచెప్పు సత్యా, మనస్సులో ఏమీ దాచుకోకు_ నీ కేమనిపిస్తోంది?" అన్నాడు శంకరం.

సత్యవతి సిగ్గుపడిపోయింది. నే చెప్పనన్నట్టు తలను అడ్డంగా తిప్పింది. పోవడానికి పెనుగులాడింది.

"ఆ పిచ్చి వేషా లెయ్యకమ్మడూ ! నిజంచెప్పు ! నీ కేమనిపిస్తుంది" అన్నాడు శంకరం, సత్యవతిని దగ్గరగా తీసుకొని.

"ఎందుకలా నన్ను చంపుతారు బాబూ ! అవతల వంటపనంతా అలానే వుండిపోయింది. నన్ను పోనిద్దురూ ! అన్నది కనీసం పోయేప్రయత్నమన్నా గట్టిగాచెయ్యకుండా.

"వంటచేయవలసినవాణ్ణి– చచ్చాంపో _ చేయవలసిన దాన్ని నేనుగానీ, మీరుకాదుగదా ! ఎందుకా తొందర చెప్పండి ? ఈ వొక్క–ముక్కా– అని, మీరిక పోవచ్చు !" అన్నాడు శంకరం, ఆడమాటలు పట్టిపట్టి మాట్లాడుతూ.

సత్యవతి, ఆ మాటలువిని పగలబడి నవ్వింది.

"నేనయితే ఎప్పుడూ అలా అడగను !" అన్న దావిడ.

శంకరం ఆలోచించాడు ఆవిధంగా సత్యవతి మాట్లాడిన దానిలా అతనికికూడా కనిపించ లేదు.

"అడక్కపోతే పోయేవు. ఇప్పుడు నే నడుగుతు న్నానుగదా! చెప్పరాదా?" అన్నాడు శంకరం.

"ఎందుకింత పట్టుదల?" అన్నది సత్యవతి.

"మరేం లేదండి! మీ నోటిమీదుగా విందామని! అంతే!" అన్నాడు శంకరం.

"వింటే ఏ మొరుగుతుందేమిటి?"

శంకరం తన సహనాన్ని పూర్తిగా కోల్పోయాడు.

"ఇష్టముంటే చెప్పు, లేకుంటే మానెయ్. నీ జననమే జయ ప్రశ్నలన్నింటికి నేను జవాబు చెప్పలేను!" అన్నాడు శంకరం సత్యవతిని వదలించుకొని యివతలికొస్తూ.

చటుక్కున సత్యవతి అతని చెయ్యి పుచ్చుకలాగి ఆపింది. రెండు చేతులూ అతని మెడచుట్టూవేసి గుండెలకు ముఖాన్ని ఆనించింది.

"నే నిలాగే మీ ముందు నుంచున్నప్పుడు మీ కేమని పించిందో—యిప్పుడు నాకూ అదే అనిపిస్తోంది!" అన్నది సత్యవతి సన్నగా.

"నాకు నిన్ను కొరుక్కుతినాలనిపించేది!" అన్నాడు శంకరం.

"ఇప్పుడు నాకు—"

ఆ పైమాట సత్యవతి అనలేకపోయింది.

"అబ్బ! ఇలాంటి మాటలన్నీ నాచేత అనిపించబో కండి బాబూ మీకు పుణ్యం ఉంటుంది!" అన్నది సత్యవతి గారాబాలపోతూ.

"తప్పేం! నేనంటూనే వుండేవాణ్ణిగా! ఇప్పుడు నువ్వు

శంకరానివి గదా! ఆ మాటలన్నీ అనే హక్కు నీ కిప్పు డున్నది!” అన్నాడు శంకరం.

“అలా అంటే తప్పు, మీరు హాయిగా వుండలేరు. అవతారాలు మారాయన్నమాటేగాని, బుద్ధిమాత్రం ఎప్పటిదే!” అన్నది సత్యవతి.

“అదృష్టవశాత్తూ అవికూడా మారలేదు. మారితే యిందులో రుచే ముంటుందండీ! నేను నేనే మీరు మీరే” అన్నాడు శంకరం నవ్వి.

మీచేత ‘మీరు’ అనిపించుకోవాలంటే సిగ్గుగావుంది. ఇంట్లో వున్నంతసేపూ మామూలుగానే పిలవండి! బైట సంగతి చూసుకోవచ్చు.” అన్నది సత్యవతి.

“అదేం లాభంలేదండి! ఇక్కణ్ణించీ ఆ అలవాటు ఉండవలసిందే!” అన్నాడు శంకరం.

సత్యవతి ఇంకేమీ అనలేదు.

“మరీపూట భోజనంసంగతేమిటో చూడు. ఈ గొడవలోపడి తిండివిషయమే మరిచిపోయాం!” అన్నాడు శంకరం.

అది నా పని కాదు సత్యా! పది గంటలకల్లా నేను ఆఫీసు కెళ్ళాలి. అప్పటి కింత తిండి పడెయ్యడం నీ వంతు. తినిపోవడం నా వంతు. అంతే!” అన్నది సత్యవతి.

సత్యవతి తన్ను ‘సత్యా’ అని పిలిచినందుకు మురిసి పోయాడు శంకరం.

“వండమంటే వండుతాను, కానీ దాన్ని మీరు తినలేరు. కాబట్టి మీరు చెయ్యికాల్చుకోవడమే వుత్తమం. లేదా నేను బజారు కెళ్ళి భోజనం పట్టుకొస్తాను. ఈ పూటకు యిద్దరం

తినేద్దాం. లేదా మీరు హోటల్లో తినండి ! ఆనక నేను కారేజి తెప్పించుకొంటాను !" అన్నాడు శంకరం.

ఆ నటనకు సత్యవతి తెగనవ్వేసింది !

"అవసరం లేదమ్మడూ ! గబగబా నేను వండేస్తాను గదూ ? ఈలోగా నువ్వు పేపరు చూసుకొంటూవుండు కాక పోతే ఓ అరగంట లేటుగావస్తానని ఆఫీసుకు ఫోనుచెయ్యి" అన్నది సత్యవతి.

"మూవారు ఆఫీసుకు ఆలస్యంగా వస్తారని నేను ఫోను చెయ్యడం ఏమంత బావుండదు. ఆపనేదో మీరే కాని వ్వండి !" అన్నాడు శంకరం కుర్చీలో కూచుని సిగరెట్ వెలిగిస్తూ.

"అలా మాటిమాటికీ సిగరెట్లు కాల్చి నా పరువు తీసెయ్యకు సత్యా ! ఎవరన్నా చూస్తే—"

శంకరం సిగరెట్ పారేశాడు.

సత్యవతి లుంగీ కట్టుకొనే వంటచేసింది. చేస్తున్నంత సేపూ అలవాటుచొప్పున, పమిటచెంగు సర్దుకొంటూ, కుచ్చెళ్ళు సర్దుకొంటూ నేవుంది. చీరెలో వున్న శంకరం రెండు మూడుసార్లు వొచ్చి తొంగిచూశాడు. తనే వంటచేయడం జరిగితే ఎలావుంటుందో అతనిప్పుడు ప్రత్యక్షంగా చూడ గలిగాడు.

"ఏమిటలా చూస్తున్నారు?" అన్నది సత్యవతి ఒకసారి.

"పాపిష్టిదాన్ని ! నేను హాయిగా కూచుని మీచేత వంట చేయిస్తున్నాను !" అన్నాడు శంకరం, భార్యమాటల్లను అనుకరిస్తూ.

సత్యవతి ఆదరాబాదరా భోజనంచేసి, శంకరానికి వడ్డించింది. అంట్లన్నీ వాకిట్లో పడవేసింది.

"ఇక ఆఫీసు కెళ్ళవచ్చునా?" అన్నది సత్యవతి మూతి తుడుచుకొంటూ. గరుకుగడ్డం ఆకురాయిలా చేతికి తగిలింది.

"రేపణ్ణించీ నా కిదో గొడవగావుచు. ప్రతిరోజూ గడ్డం గీసుకోవాలి"అన్నది సత్యవతి, గడ్డాన్ని వేళ్ళతో నిమురు కొంటూ.

"అది రేపటి సంగతికదా! ముందీపూట విషయ మేమిటో చూడు! ఇప్పటికే పావుగంట లేటయింది. నీకోసం అధమం పాతికఫైళ్ళయినా ఎదురుచూస్తుంటాయి!" అన్నాడు శంకరం.

"వాటి నేం చెయ్యమంటారు?" అన్నది సత్యవతి.

"ఫైలంతా చూస్తే నీకే తెలుస్తుంది. అక్కడ రామారావని ఓ గుమాస్తా వున్నాడు. చాలా మంచివాడు. గొడ్డులాగా పనిచేస్తాడు. టెక్నికల్ గా నీకు తెలియనప్పుడు, అతన్ని పిలిచి అడుగుతుండు అయితే, ఆ విషయం నీకసలే తెలియనట్టుగా వుండకూడదు" అని చెప్పుకుపోతున్నాడు శంకరం.

"తెలియంది తెలియనట్టుండక, తెలిసినట్టెలా ప్రవర్తించడమండీ?" అన్నది సత్యవతి కళ్ళు చిట్లించి.

"అదే ఆఫీసులోవుండే ప్రత్యేకత. ఆ ఫైల్ అతనికిచ్చి 'ఇదేదో పూర్తిచేసుకురా రామారావ్!' అను. మిగతా పనంతా అతనే చేసుకొచ్చి సంతకంకోసం ఫైలు నీదగ్గరకు పంపుతాడు. వెంకటరత్నమని మరో గుమాస్తా

వున్నాడు. వాడు పనిదొంగ. పన్నెండుగంటలకు ఆఫీసు కొచ్చి పదిగంటలకే వచ్చానంటాడు. చెప్పినపని చెయ్యడు. ఆఫీసుకొచ్చికూడా స్వంతపనులే చూసుకుంటాడు. అతన్నెప్పుడూ 'ఇదేమిటి' అని అనకు.

సత్యవతి ముఖం చిట్లించి చూసింది.

"ఇన్ని అబద్ధాలాడుతుంటే అతన్నెలా సహిస్తున్నారండీ?" అన్నదావిడ.

"నేనూ మొదట్లో అలానే అనుకున్నాను. క్రమంగా సహించడానికి అలవాటు పడిపోయాను. గట్టిగా మాట్లాడితే నేను పదిగంటలకే వచ్చానంటాడు. ఆ సమయానికి మీరు లేరంటాడు. రిపోర్టు రాశామనుకో, ఆకాశరామన్న వుత్తరాలు రాస్తాడు. ఫలానావాడు, ఫలానావాడిదగ్గర లంచం తీసుకున్నాడనో, ఫలానావాడికీ, ఫలానా టైపిస్టుకూ సంబంధాలున్నాయనో వుత్తరాలు రాస్తాడు. నాకంటేముందుగా, పనిచేసిన ఆఫీసరు బదిలీకావడానికి వీడేకారణం! రాఘవయ్య అని మరో గుమాస్తా వున్నాడు..."

"వీడెలాంటివాడు?" అన్నది సత్యవతి.

"శుద్ధలౌకికుడు. మనమేదన్నా 'అవునవును' అంటాడు. పై అధికారుల్ని వుబ్బెయ్యడమే వాడిపని. అయితే తనపని తను చూసుకొంటాడు. బుద్ధిపుడితే యితరులకూడ సాయ పడుతాడు. మంచి చెయ్యలేడు. కనీసం అపకారం కూడా చెయ్యలేడు.

"వీరేనన్న మాట?" అన్నది సత్యవతి.

"ఇంకా వున్నారనుకో" అని శంకరం నవ్వాడు.

# కరిమింగిన వెలగపండు

"మరో మనిషి సుమతి."

"ఆవి డెలాంటిది?" అన్నది సత్యవతి, ప్రాణాలన్నీ వుగ్గబట్టుకొని.

"ఆసంగతి ముందుగా చెప్పడం భావ్యంకాదు సత్యా! స్వయంగా నువ్వే తెలుసుకోవడం మంచిది" అన్నాడు శంకరం

ఆ తరవాత, సత్యవతికి పాంటుతొడిగి, ఇన్ షర్టువేసి, కోటు భుజానికి తగిలించి, చంకలో ఫైలు పెట్టి, 'ఇక బయలు దేరు' అన్నాడు. ఈపూటకు రిక్షామీద వెళ్ళమనీ బస్సుల ప్రయాణంగురించి రేపు చెబుతాననీ అన్నాడు. అవసరమయి నప్పుడు ఫోను చెయ్యమన్నాడు సత్యవతి ఓ నిముషంపాటు తదేకంగా ఆకాశంకేసి చూసి, 'వస్తా' నన్నట్లుగా తలెగరేసి వెళ్ళిపోయింది. ఆవిడ వీధిమలుపు తిరిగిందాకా శంకరం వాకిట్లోనే నిలబడ్డాడు.

సత్యవతి ఎక్కిన రిక్షా దాటిపోయాక, శంకరానికి సన్నగా కంపర బయలుదేరింది. ఆకస్మికంగా, నిర్మానుష్య మైన దీవిలో నిలబడిపోయిన భావనకలిగింది. గేటుకు గడియ బెట్టి వచ్చి కుర్చీలో కూలబడ్డాడు. అతని కేంచెయ్యడానికీ తోచలేదు. సాయంత్రందాకా యెలా కాలంగడిచేట్టు?

వెంటనే సత్యవతి జ్ఞాపకంవచ్చింది. ఆవిడకయినా పొద్దుపోవాలిగదా! సత్యవతి ఏంచేస్తుండేదో అడిగి తెలుసు కోవలసింది! ఆఫీసులో ఆవిడేం చెయ్యాలో తను చెప్పాడు గానీ, ఇంట్లో తనేం చెయ్యవలసిందీ సత్యవతి చెప్పలేదు. సాధారణంగా ఆడవాళ్ళు పొరుగిళ్ళ కెడతారు. లేదా ఏవో

దిక్కుమాలిన ఆటలన్నీ ఆడుతూ కూచుంటారు. తనకయితే అవేమీ చేతకాదు. కాబట్టి ఏదన్నా చదువుతూ కూచోవాలి.

శంకరం లేచి, బీరువా తలుపులు తీశాడు. చలంగారి పుస్తకాలు, గోపీచంద్ కథలు, కుటుంబరావుగారి ఆడజన్మ, ఓ పాతిక డిటెక్టివ్ నవలలు, ఇంకేవో ఇంగ్లీషు పుస్తకాలూ వున్నాయి. చేతికందిన అరడజను పుస్తకాలు లాక్కుని, సిగరెట్ పెట్టీ, అగ్గిపెట్టీ కుర్చీపక్కనే పెట్టుకొని, కాళ్లు చాపుకొందుకు, స్టూల్ బల్ల సర్దుకొని తాపీగా కుర్చీలో కూచున్నాడు. సిగరెట్ వెలిగించి, ఓ పుస్తకం తెరిచాడు. గోపీచంద్‌గారు వ్రాసిన 'పతివ్రత ఆంతర్యం' అన్న కథ కనిపించింది. చదవడం సాగించాడు. కథ మాంచి పట్టులోవుంది. మహాపతివ్రత చెట్టుకున్న కాయల్ని చూపించి, అవేమి కాయలని అడిగి జవాబు తెలుసుకొని సిగ్గుపడుతున్న ఘట్టమది. అక్కడకొచ్చేసరికి శంకరానికి నవ్వాగలేదు. పుస్తకాన్ని పేజీలుకలవకుండా పొట్టమీద ఆనించుకొని తెగ నవ్వేస్తున్నాడు.

"ఏమిటోయ్ వదినా అదీ!" అన్నమాట వినిపించింది.

శంకరం నవ్వునుండి తెప్పరిల్లాడు. ఆమాట వినిపించిన వేపు చూశాడు. ఇరవై యేళ్ళ వయస్సున్న అందమైన అమ్మాయి, పదిపుస్తకాల దొంతరను రొమ్ములకానించుకొని వస్తోంది.

శంకరం, ఆవిణ్ణి తేరపార చూశాడు. ఆ ముఖాన్ని అతనెప్పుడో చూసినట్టుగావుంది. ఎక్కడచూసిందీ, ఎప్పుడు

చూసిందీ జ్ఞాపకానికి రాలేదు. స్టూల్ మీదినించి కాళ్లు తీసి నిలబడ్డాడు.

"రండి! ఆవిడ యింట్లో లేదు, ఆఫీసు కెళ్ళింది" అన్నాడు శంకరం.

ఆ మాటలు వింటూనే అందమైన అమ్మాయి ఆశ్చర్య పోయింది. ఓ క్షణం వెుగాదిగా శంకరాన్ని చూసింది. ఆ వెంటనే చిన్న కేకపెట్టింది. శంకరానికిదంతా అడవిగోడులా అనిపించింది. ఏమి చెయ్యడానికీ తోచక సిగరెట్టును మరో సారి గట్టిగా పీల్చి అవతల పారేశాడు.

"ఇదెప్పణ్ణించీ సత్యం? నువ్వు సిగరెట్లు కాలుస్తావని నా కింతవరకూ తెలీదే!" అన్న దావిడ.

తను సత్యవతిగా మారాలనీ, ఆవిడలాగానే నటించా లనీ అప్పుడు తట్టింది శంకరానికి. అంతకుముందు ఆ వచ్చి నావిడతో యేమన్నదీ అతని స్ఫురణకు రాలేదు.

"నువ్వొస్తావని తెలిస్తే కాల్చకనేపోదును..." శంకరం వాక్యాన్ని ఠక్కుమని ఆపేశాడు. ఆ తరవాత యేమనాలి? కాల్చకపోదును విమలా, కమలా, సరసు, సీత, జానకి, సర స్వతి, మంజు, వాణి, వేణీ... యేమిటి సంబోధించాలప్పుడు?

దొంగా! ఇంతకాలానికి దొరికావన్న మాట! సాయంత్రం మా అన్నయ్యనురానీ, యీ సంగతి చెప్పక పోతే అప్పుడను" అన్నది.

అంటే ఈవిడ తనకు వదినవరస వుతుందనుకొన్నాడు శంకరం. ఇదీ కొంతమేలే. కనీసం వరసన్నా తెలిసింది. లేకపోతే సంభాషణ పొడిగించడం మరీ కష్టమయిపోను.

"నాకయినా అలవాటులేదొదినా! మీ అన్నయ్య గారు, ఇవ్వాళ్ళో సిగరెట్ పెట్టె మరచిపోయారు. ఎప్పుడూ అదేపనిగా కాలుస్తుంటారుగదా, అందులోవుండే రుచేమిటో తెలుసుకొందామని, నేను ఓ సిగరెట్ వెలిగించిచూశాను!" అన్నాడు శంకరం.

అందమైనఅమ్మాయి, చిరిచాప పరచుకొని, తలకింద రెండుదిళ్ళు వేసుకొని, 'అమ్మయ్య' అంటూ వెల్లకితలా పడుకొంది. పల్చని నైలాన్ చీరలోంచి, పచ్చని తొడలు కన్పిస్తున్నాయి. కుచ్చెళ్ళలోకి వేళ్ళుపోనిచ్చి అటూ ఇటూ నెమురుకొని, రవంత వడులుచేసుకొంది. కుడిరొమ్ముమీది పమిటతొలగి, ఆభాగం యెత్తుగా కనపడుతోంది. శంకరం ఆ మేరకే చూస్తున్నాడు.

"ఏమిటొదినా అలా వెర్రిగా చూస్తావేమిటి?" అన్నదా అమ్మాయి, రొమ్ముమీదికి పమిటయినా లాక్కోకుండా.

"ఏమీలేదు..."

మళ్ళా గొంతులో పచ్చివెలక్కాయ అడ్డుపడింది. ఎంతకాలమని, ఇలా అసంపూర్తివాక్యాల్లో మాట్లాడేట్టు?

"రా వదినా! రోజూ ఆచాపమీద డొళ్ళుందే తోచదనే దానివిగా, ఇవ్వాళ, నారాయణమేకల్లే అలా నుంచుంటావేం?"

శంకరం ప్రాణాలు లేచిపోయాయి. తనిప్పుడువెళ్ళి, పేరన్నా తెలీని ఆ పిల్లపక్కన పడుకోవాలి. తను ఏకపత్నీవ్రతుడు కాడుగానీ, మరీ అంత పచ్చిబాతుకుకూడా సహించలేడు. ఇప్పుడెలా?

"ఇల్లరా నీకోమంచిసంగతి చెబుతాను" అని సన్నగ కన్నుగీటిందామ్మాయి.

శంకరానికి తప్పేటట్టులేదు. అడుగులోఅడుగు వేసుకొంటూ చాపదాక వచ్చాడు. అప్పటికే అతనిలో వణుకు ప్రారంభమైంది. మెల్లగా చెమటలు కమ్ముకొస్తున్నాయి. గుటకలు మింగుతున్నాడు. ఎవరన్నా చూస్తున్నారేమో నన్నట్లుగా, భయభయంగా అటూయిటూ చూస్తున్నాడు.

"ఏమిటోయ్ యీ అభినయమంతా కొంపతీసి, ఏదన్నా నాటకంలో మగవేషంగానీ వేయడంలేదుగదా ?" అని ఫక్కున నవ్విందా అమ్మాయి.

శంకరం నిట్టూర్చాడు. ఓసారి చాపమీద కూచోబోయికూడా మానేశాడు. వెనక్కు రెండడుగులు వేశాడు.

"దేనికిలే__" మళ్ళా వాక్యం ఆగిపోయింది.

"భలేభలే ! అర్థంకాకుండా లేమిటి సత్యం? ఈదిక్కుమాలిన అభినయం కాస్త కట్టిపెట్టవమ్మా తల్లీ ! ముందునాకు నీ సలహా కావాలి ?"

"ఇక్కడుండి చెబుతాను గదా !"

శంకరం కుర్చీలో కూలబడపోతున్నాడు. అందమైన అమ్మాయి, రెండు దోర్ళిగింతలు పెట్టి, కుర్చీకిదగ్గరగా జరిగి శంకరం కుచ్చెళ్ళు పట్టుకొని లాగింది. అదృష్టవశాత్తూ శంకరం లేచాడు. మరోక్షణం ఆగినట్లయితే కుచ్చెళ్ళుకాస్తా ఊడి, చీరె కష్టబడిపోయేది. మళ్ళా సత్యవతి వచ్చిందాకా లంగాతో వుండనన్నా వుండాలి, లేదా అందమైన అమ్మాయితో చీరనన్నా కట్టించుకోవాలి.

"ఎవరన్నా చూస్తారేమో, తలుపన్నా వేసివస్తాను!" అన్నాడు శంకరం.

"చూస్తే నేం మనిద్దరం కరచుకొని పడుకొంటే, ఏదో జరుగుతున్నట్లుగా మాట్లాడతావేం సత్యం ? ఇదివర కెన్నిసార్లలా పడుకోలా ?" అన్న దావిడ, ఆశ్చర్యంగా చూస్తూ.

శంకరం ఉత్తినే భయపడి ఛస్తున్నాడుగానీ, ఇప్పుడు మాత్రం అలా కరచుకొని పడుకొంటే మునిగేకొంప ఏమీ లేదు. అలాంటి ప్రమాదమేవుంటే, ఆవిడమాత్రం అంత సులభంగా అంటుందామరి ?

"ఇంత అందమైన పిల్లను సత్యవతి ఆరుకొని పడుకొనేదన్నమాట!" అనుకొన్నాడు శంకరం.

"ఏమిటి సత్యం ఆలోచన? నువ్వలా పిచ్చివేషాలు వేస్తే నేను వెళతాను." అని లేచికూచుందావిడ.

"సరే పో" అందామనుకొన్నాడు.

ఆ మాట అనకముందే, ఆవిడచెయ్యి పుచ్చుకులాగి కూచోబెట్టింది. ఆ తరువాత రొమ్ములమీద చెయ్యివేసి వెనక్కు నెట్టింది. శంకరం తల దిండుమీద పడింది. ఆవిడ కూడా పడుకొని, శంకరాన్ని తనవేపుకు తిప్పుకుంది. నడుం మీదుగా చెయ్యివేసి దగ్గరగా లాక్కుంది.

శంకరంలో మెరుపు మెరసినట్లయింది.

"నువ్వేం ఆలోచించావో చెప్పుసత్యం" అన్నదావిడ, శంకరం నడుంమీది చెయ్యి తీయకుండానే!

"ఏవిషయం?" అన్నాడు శంకరం!

"అదేమిటోయ్ అలాఅంటావ్ !" అన్నదావిడ కాస్త విసుగ్గా.

"నేను లక్ష విషయాలను గురించి ఆలోచిస్తాను. దేన్నని చెప్పమంటావ్."

మళ్ళా వాక్యం పూర్తికాకుండానే ఆగిపోయింది.

"నిన్న నడిగితే ఈపూట చెబుతానన్నావు గదు టోయి సత్యం? అందుకని ప్రకాశాన్ని ఈపూట రమ్మన్నాను. సాయంత్రం అతను పార్కుకొస్తాడు. ఏమని చెప్ప మంటావుసత్యం? నాకేమీ పాలుపోవడంలేదు" అన్నదావిడ.

శంకరంబుర్రలో కందిరీగల రొద ప్రారంభమయింది. ఈవిడెవరో తెలియకనే తను భస్తుంటే, మరో ప్రకాశంగా డొచ్చిపడ్డాడు. వాడికేదో ఈవిడచెప్పాలట. దేన్నిగురించో తెలీదు. దానికి తనిప్పుడు సలహా యివ్వాలి.

"ఇంకా ఆలోచించలేదా?"

"లేదు" అన్నాడు శంకరం ఆవిడఅందాన్ని కళ్ళతో తాగేస్తూ.

"అలా చూస్తావేం వొదినా, మగాళ్లు చూసినట్టూ? ఆ ప్రకాశమూ అంతే! కనబడితేచాలు, ప్రాణాలన్నీ ఉగ్గ బట్టుకొని, నాముఖంకేసి చూస్తుంటాడు. పోతానంటే వద్దం టాడు. 'మరోగంట కూచోరమణీ!' అంటాడు. అప్పటి కయినా వెళ్ళాలిగదా అంటే, నిన్ను ఎంతసేపుచూచినా చూసినట్టే అంటాడు. ఇవ్వాళ నీ చూపులు చూస్తుంటే, అచ్చు- అతగాడు చూస్తున్నట్టేవుంది."

'అమ్మయ్య!' అని గాలి వొదిలాడు శంకరం. ఈ

మహాతల్లి పేరు రమణి ఈవిడ ప్రకాశాన్ని ప్రేమించింది. ఆ తరువాత.

"ఇవన్నీ నేనంటుంటే నీ పాతరోజులు జ్ఞాపకం వస్తున్నాయా సత్యం?" అన్నది రమణి, గొంతుకింద చక్కిలిగింత పెడుతూ. శంకరం, అంత టెన్షన్‌లోనూ నవ్వాడు.

"శంకరం అన్నయ్యకూడా, నీకోసం యిలానే వచ్చేవాడుకదూ?" అన్నది రమణి నవ్వుతూ.

శంకరం నవ్వాడు.

"అలా నవ్వకుమరి! నీలాంటి అనుభవం వున్నవారు, కొత్తవారికి సలహాలివ్వాలిగానీ, అలా నవ్వేస్తే కుదరదండీ!" అన్నది రమణి.

"అవును రమా! నేనూ అలానే పడిగాపులు కాసేవాణ్ణి!" అన్నాడు శంకరం.

రమణి, యీసారి బుగ్గలు కందిపోయేలాగా నవ్వి, శంకరాన్ని మరింత దగ్గరగా పొదువుకొని, బుగ్గ గాటుపడేలాగా కొరికి ముద్దెట్టుకొంది. శంకరం శరీరమంతా పులకరించి మరో సమయంలోనైతే రమణి శీలంకాస్తా యీపాటికి హరింపుఅయి వుండేది. ఇప్పుడు తనూ రమణిలాంటివాడే!

"భలేదానివోయి నువ్వు! మగాళ్ళేదో సుఖపడిపోతున్నారని, అస్తమానూ గోలపెడుతుంటావుగదా! ఈ దిక్కుమాలిన ఆలోచనలతో, నీకు మగాడిమాటలే అబ్బినట్టుంది వదినా!" అన్నది రమణి.

ఏదో కొంప మునిగిందనుకున్నాడు శంకరం.

"ఇప్పుడేమయిందేం?"

"పడిగాపులు కాసే దాన్ని - అనడానికి బదులు 'కాసే వాణ్ణి' అన్నావులే, అందుకంటున్నాను" అన్నది రమణి, శంకరాన్ని మరింత దగ్గరగా లాక్కుంటూ.

"అవును" అన్నాడు శంకరం.

"ఏమిటవును ?"

"పడిగాపులు కాసేదాన్ని !" అన్నాడు శంకరం తను కూడా పాతసంగతులు జ్ఞాపకం చేసుకొని నవ్వుతూ.

"మా అన్నయ్య యెప్పుడన్నా, నీ కాలు గీకేవాడా వాదినా ?" అన్నది రమణి.

శంకరం నవ్వాపుకోలేకపోయాడు పెళ్ళికిముందు, తనెప్పుడూ సత్యవతి కాలుగీకిన జ్ఞాపకంలేదు. కాకపోతే చేతిని నొక్కుతుండేవాడు. పెళ్ళయ్యాక యెప్పుడో తప్ప, అలా గీకవలసిన అవసరం కలిగేదికాదు. అనుకోకూడదు గాని, అలాంటిపనేదో సత్యవతే చేస్తుండేది. పరిస్థితులు మారాక ఇద్దరూ, అదేదో నిత్యనైమిత్తికాల్లో వో భాగంగా అనుకునేవారేతప్ప, అంతకుమించినవిలువ నివ్వలేకపోయారు.

"ఏమిటాలోచిస్తున్నావు ?" అన్నది రమణి.

"కాలు గీకుణ్ణి గురించి" అన్నాడు శంకరం.

"ఇంతసేపా ? అవునో కాదో తక్కున చెప్పెయ్యాలి గానీ !"

"పెళ్ళి కాకముందు ..."

"ఊఁ" అని ప్రోత్సాహపరచింది రమణి.

"నే చెప్పను !" అన్నాడు శంకరం సిగ్గుపడి.

"అలా మూతి ముడుచుకొన్నప్పుడు, నువ్వు చాలా

బాగుంటావా వదినా! ఈ ఎరవేసే నువ్వు మా అన్నయ్యను చిక్కించుకొన్నా వనుకొంటాను. ఎప్పుడన్నా మీ రీసంగ తులు అనుకొంటారా" అన్నది రమణి.

తినబోతున్నావుగదా రమణి! రుచితో పనేమిటిక? రేపు ప్రకాశమూ, నువ్వూమాత్రం ఈ సంగతులన్నీ అను కోకుండావుంటారా?"

"మా సంగతి వాదిలేయ్! మీరనుకొన్నారుగదా" అన్నది రమణి, కింది పెదవి సున్నితంగా కొరుక్కొంటూ! "అయితే యీ రవరవ లెందుకొచ్చాయోయ్ సత్యం? మా అన్నగారు అంత అవివేకి మనిషా? సుమతికి, ఆయనకూ నిజంగా సంబంధ ముందంటావా వదినా."

శంకరం ముఖం క్షణంలో మారిపోయింది.

"అబద్ధం, ఆ మాటలన్నవారు పురుగులుపడిపోతారు" అన్నాడు వుద్రేకంగా.

రమణి బిత్తరపోయింది.

"ఆమాట నేను మొదట్నించీ అంటూనే వున్నాను. నువ్వే నమ్మావు కాదు. గిట్టనివాళ్ళెవరో కల్పించారమ్మా అంటే వినకపోతివి. 'మీ అన్నయ్య బుద్ధి నీకు తెలీదు లేవోయ్' అంటావాయె! ఇప్పటికన్నా తెలిసిందా?" అన్నది రమణి కళ్ళు టపటపలాడిస్తూ.

శంకరం రెండు కణతలూ నొక్కుకొన్నాడు.

"లేదు రమా! ఇంకా నిజం తేలాలి. నేనేదో ధోరణిలో వుండి అలా అన్నాను" అన్నాడు శంకరం.

"ఇంకా నీకా అనుమానం పోలేదన్నమాట!"

'లే' దన్నట్టు తలాడించాడు శంకరం.

"మరి పురుగులు పడిపోతారన్నా వేం?"

"అది ఆయనగా రనే మాట" అన్నాడు శంకరం.

రమణి నిట్టూర్చింది.

"సుమతి చాలా అందంగా వుంటుందా వొదినా?" అన్నది రమణి.

"ఆఁ, సత్యవతికన్నా బాగానే వుంటుంది. అలా వుండేవాళ్ళు యీ దేశంలో కొన్ని లక్షలమంది వుంటే వుండొచ్చు. అంతమాత్రాన వారికీ, నాకూ యేవో సంబంధా లున్నాయనుకోవడం మూర్ఖం. ఆ సంబంధాలు పెట్టుకోవడం నాకాట్టే కష్టం కానేకాదు. ఎందుకంటే సుమతి నాకింద పనిచేసే వుద్యోగిని. ఆవిడభవిష్యత్తంతా నా చేతుల్లో వుంది. కానీ అలాంటి చిక్కుల్లో యిరికించి దత్తితీర్చుకోవడం నా కిష్టంలేదు. కానీ సత్యవతిమాత్రం నమ్మదు. నా ఖర్మ!" అన్నాడు శంకరం నిట్టూర్చి.

"అని మా అన్నగా రంటారంటున్నావు. అవునా వొదినా." అన్నది రమణి కూడా నిట్టూర్చి.

"మరే!" అన్నాడు శంకరం తెప్పరిల్లుకొని.

దాదాపు అయిదారు నిమిషాలదాకా యెవ్వరూ పలక లేదు. ఆ నిశ్శబ్దాన్ని యిద్దరూ భరించలేకపోయారు.

"అయితే ప్రకాశాన్ని వొద్దనమన్నావా?"

"అలా యెందుకు రమణీ? మీ రిద్దరూ తప్పకుండా పెళ్ళాడండి! మా జీవితం యిలా అయింది కాబట్టి, అందరూ యిలానే తయారవుతారని యెందు కనుకోవాలి? ప్రకాశం,

చాలా మంచివాడుకావచ్చు, మీ బ్రతుకు సుఖంగా వుండొచ్చు, వద్దనటం దేనికిట ?" అన్నాడు శంకరం.

రమణి దయ్యాన్ని చూసినట్టు శంకరంకేసి చూసింది.

"ఇవ్వాళ నీ మనస్సేమీ బాగోలేదనుకుంటాను, వొదినా! నిన్నటిదాకా, దిక్కుమాలిన ప్రేమను నమ్ముకొని గొంతుకు వురిపెట్టుకోవద్దంటివి. ఇవ్వాళేమో తప్పకుండా చేసుకోమంటుంటివి ? అసలీ గొడవంతా యేమిటి సత్యం ?" అన్నది రమణి, సూటిగా శంకరం కళ్ళల్లోకిచూస్తూ.

ఆ చూపుల్లోని వాత్సల్యానికి శంకరం తట్టుకోలేకపోయాడు, తల దించేసుకున్నాడు.

"చెప్పు వదినా! నేనిన్ని సంగతులూ అరవిడిచి నీతో చెప్పుకొంటున్నాను గదా ! నువ్విలా మనస్సులో దాచుకోవడం ధర్మమేనా" నన్నాసూత్రం నమ్మలేవా సత్యం ?" అన్నది రమణి, శంకరం గడ్డంపుచ్చుకొని బ్రతిమాలుతూ.

ఏమని చెప్పడమో శంకరానికి తోచలేదు.

"ఉదయం, నువ్వూ అన్నయ్యా కీచులాడుకొన్నారా ?" అన్నది రమణి.

శంకరం పలకలేదు.

"నువ్వయినా మరీ అంత పెడసరంగా వుండకూడదోయి ! నిజమో అబద్ధమో యెవ్వరికి తెలిసాయె ! ఎవరో అన్నమాటను పట్టుకొని సంసారం గుల్ల చేసుకుంటారా ?" అన్నది రమణి.

ఆ నిమిషాన రమణి, అసలు వయస్సుకు నాలుగురెట్లు పెద్దదానిలా కనిపించింది శంకరానికి.

"అన్నయ్యను 'ఇదేమి' టని అడగటానికి నాకూ భయంగా వున్నదొదినా! ఎప్పుడూ మాట్లాడలేదాయె! ఎదురుపడితె తలొంచుకొని వెడతాడాయె. ఎలా మరి?" అన్నది రమణి.

శంకరం యీసారీ పలకలేదు.

"పోనీ ప్రకాశాన్ని యీ విషయం కూపీ తియ్యమని అడగనా వదినా!"

"అలాంటివేమీ అతనితో చెప్పకు. లేనిపోనివన్నీ ఊహించుకొని, గిజాలె త్తిపోతాడు. ఇదేదో నాలుగైదు రోజుల్లో తేలిపోతుంది!" అన్నాడు శంకరం.

ఈసారి రమణీ మాట్లాడలేదు. వెల్లకితలా తిరిగి, పైకప్పుకేసి చూస్తూవుంది.

"అక్కడ ప్రకాశం కనిపిస్తున్నాడా?" అన్నాడు శంకరం, రమణి బుగ్గమీద సన్నగా చిటిక వేస్తూ.

రమణి సిగ్గుపడి నవ్వింది.

"నీకూ అన్నగారు కనిపించేవాడా?"

"ఆఁ" అన్నాడు శంకరం.

"అయితే నన్నడక్కు మరి!" అన్నది రమణి నవ్వి.

శంకరం నిట్టూర్చాడు.

"ఇంతమంచిదానివి నిన్నొదులుకోవడమేమిటి వదినా! ఆడదాన్నయిపోయానుగానీ, లేకపోతే ఈపాటికి రేప్ కేసు కింద జైల్లో పడివుందును" అన్నది రమణి, చెక్కిలికోసం శంకరం ముఖంవేపు వొంగుతూ.

"మరీ ఆకలిమీద వున్నావనుకొంటాను రమణీ!" అన్నాడు శంకరం బుగ్గను తప్పించేస్తూ.

"హోవోయ్! నీకు మహా లేనట్టు. ఆకలి యెక్కువయ్యే గదా మా అన్నయ్యను యిప్పుడు ఆడిపోసుకోవడం" అన్నది రమణి కన్ను మలుపుతూ.

ఈ మాటతో శంకరం మరీ రెచ్చిపోయాడు. రమణిని దగ్గరగా లాక్కొని వూపిరి ఆగిపోయేలా ఆలింగనం చేసుకొన్నాడు. అప్రయత్నంగా రమణి కళ్లు మూతలు పడిపోయాయి...

సూరమ్మ వచ్చి లేపకపోయినట్లయితే వాళ్ళిద్దరూ అలానే నిద్రపోతూవుండేవారు. "అంట్లు పడేయండమ్మా!" కాకిలాగా అరవసాగింది. ముందుగా శంకరం లేచాడు. పమిటంతా జారిపోయింది. కుచ్చెళ్లు వదులయిపోయాయి. చేతి గాజులురెండూ పెనగులాటలో విరిగిపోయాయి. జుట్టంతా రేగివుంది. రమణి యింకా నిద్రపోతూనేవుంది.

"వాళ్లు తెలీకుండా నిద్రపోతుండారేందుండీ అమ్మగారూ?" అన్నది సూరమ్మ

శంకరం ఆవలించి చిటికివేశాడు. పగటి నిద్ర అతనికసలే అలవాటు లేదు. దానికి తోడు కిరిచాపమీద పడుకొన్నాడు. ప్రయోజనంలేకపోయినా రమణితో పెనుగులాడాడు. వొళ్ళంతా విరిగిపోతున్నట్టుగావుంది.

"ముందు గుడ్డలు పడెయ్యండమ్మా, గుంజుతాను. లేకపోతే సాయంత్రానికి ఆరవుగందా మరి?" అన్నది సూరమ్మ.

"అవును" అన్నాడు శంకరం.

"సబ్బుముక్క పడెయ్యేరూ ?

"ఎక్కడుందో నా కేం తెలుసు సూరమ్మా ? అన్నాడు శంకరం.

"అదేందుండీ ! మీతాన గాకపోతే నాకేడ తెలుస్తుదండీ సబ్బు ముచ్చట ?" అన్నది సూరమ్మ.

"ఎక్కడుంటోందో నాకు తెలీదు. ఈ పూటకు కొత్తది తీసుకురా !" అంటూ పక్కజేబుకోసం తడువుకొన్నాడు శంకరం.

సూరమ్మ చిత్రంగా చూడటం గమనించి శంకరం పొరపాటును గ్రహించాడు. జారిపోయిన పమిటను భుజం మీదకు వేసుకొన్నాడు. అది మళ్ళీ జారింది. ఈసారి గట్టిగా లాగి భుజంమీద అణిచిపెట్టాడు. ఈ దెబ్బతో కుచ్చెళ్ళు పట్టుతప్పాయి. చీరె వదులయి నడుంమీద నిలవడం లేదు. రెండు చేతులూ నడుముకు రెండుప్రక్కలా బిగించి, గబగబా ప్రక్కగదిలోకొచ్చాడు. వంకెకున్న తుండుగుడ్డను నడుం చుట్టూ చుట్టుకొని గట్టిగా బిగించిపారేశాడు.

"ఎందుండీ అట్ల కట్టుకున్నారు ?" అన్నది సూరమ్మ.

"నడుం నొప్పిగావుందే ! నువ్వెళ్ళి నీ పని చూసుకో. పో !" అన్నాడు శంకరం.

"మీరూ రండి అమ్మగారూ ! ఆ గదిలోకి నన్ను యెల్లొద్దన్నారుగందా " అన్నది సూరమ్మ.

"ఇప్పుడు వెళ్ళమంటున్నానుగదా నువ్వెళ్ళు."

సూరమ్మ గొణుక్కుంటూ వెళ్ళిపోయింది.

మంచినిద్ర పట్టింది వదినా !" అంటూ రమణి వచ్చింది.

"అంటే మంచి కలకూడా వచ్చిందన్నమాట! ఆ కలలో ప్రకాశం కనిపించి..."

"పోవోయ్!" అన్నది రమణి ముఖం చిట్లించుకుంటూ. "ఇంటికెడతాను వదినా! అమ్మ నాకోసం కనిపెట్టుకొనుంటుంది"

శంకరం ఏ సమాధానమూ చెప్పకముందే రమణి బయలుదేరింది ఆవిడ వెళ్ళినవేపే కన్నార్పకుండా చూశాడు శంకరం. రమణి గేటు దాటింది. తిరిగి వంటరితనం ఆవేశించింది. తలంతా దిమ్మెత్తినట్లనిపించింది. రమణి రావడం, తనపక్కన పడుకోవడం, ప్రకాశం కబుర్లు ఇవన్నీ కలలాగా అనిపించాయి. లేచివెళ్ళి సిగరెట్ వెలిగించాడు. రెండు గుక్కలు పీల్చాడో లేదో, టెలిఫోన్ రొదపెట్టింది.

"శంకరాన్ని మాట్లాడుతున్నాను" ఎవరది? అన్నాడు శంకరం, పొగను మెల్లిగా వూదేస్తూ.

"నేను శంకరాన్ని మాట్లాడుతున్నాను. ఆఫీసునుండి! ఎవరో రఘునాథరావుట, 'ఇవ్వాళ సాయింత్రం నన్ను రమ్మంటారా ?' అని అడుగుతున్నాడు. నన్నేం చెప్పమంటారు" అన్నది సత్యవతి గొంతు అవతలినుంచి.

"నువ్వా ?" అని నవ్వాడు శంకరం.

"ఎలావుంది నీ పరిస్థితి ?"

"ఆరునెల్లు చెప్పినా తీరదు. ముందీమాట చెప్పండి. నన్నేం చెయ్యమంటారు ?" అన్నది సత్యవతి.

"రమ్మను"

"అంటె అతనొస్తాడు మరి ?"

"వస్తే రానివ్వు సత్యం ! మాట్లాడి పంపు" అన్నాడు శంకరం.

"నన్నింకా బురదలోకి దింపకండి. రేపు రమ్మంటాను"

"రేపయినా బురదలోకి దిగక తప్పేదేముంది ?" అన్నాడు శంకరం.

"కనీసం ఈపూటకు తప్పినా తప్పినట్లే!"

శంకరం ఏదో చెబుదామనుకొన్నాడుగానీ. అప్పటికే ఫోను పెట్టేసింది అతను సిగరెట్ పారేసి, అలవాటు ప్రకారం, కాలితో నొక్కాడు. బూట్ లేనుగనక కాలు చుర్రుమంది.

"మీరు దొరలింటో పుట్టాల్సిన మనుసులుండీ అమ్మగారూ !" అన్నది సూరమ్మ.

"అదేమే !" అన్నాడు శంకరం.

"ఆరే గదుండీ, ఆడోరుకూడా సిగరెట్లు కాలుస్తరు. మీా అసుమంటోరికి, మన నాటుమనుసులు గిట్టరనుకోరి !"

ఈ పొగడ్త వెనక ఏదో దాగివుండాలనుకొన్నాడు శంకరం.

"ఏంచేస్తాం సూరమ్మా ! ఇదంతా నా ఖర్మ, నా రాత బాగుండక ఇటువంటిచోట వచ్చిపడ్డాను" అన్నాడు శంకరం.

"సల్లని తల్లీ ! నాజీవంకూడా పోసుకు బతుకు బిడ్డా!"

అని దీవించింది సూరమ్మ "తల్లీ ! నువ్వేయ్యేనుకో, లచ్చ నుకో, ఈ శంకరం అసుమంటివారికాడ, ఆడోగు సుకపడ లేరనుకోరి !"

శంకరం మనస్సు కలుక్కుమన్నది.

"నిజం సూరమ్మా ! అలా కూచో పాపం ! ! నీకూ నాలాంటి బిడ్డలుండే వుంటారు. వాళ్ళిట్టా కష్టపడుతుంటే నువ్వు చూస్తూ వూరుకుంటావా ?" అన్నాడు శంకరం.

ఆ మాటతో సూరమ్మలో కదలిక ప్రారంభమయింది. అది అటూ యిటూ ఓసారి పరకాయించి చూసింది. ఏదో రహస్యం చెబుతున్నదానిలాగా గొంతు తగ్గించి మాట్లాడ సాగింది.

"మీలాంటి తల్లే, గదు గా బాజార్న ఓరుండారుండీ ! మొగుడు కన్నె త్తిసూసేటోడుకాదు. గిట్టనే నాకాడ ఎల్లదీసు కొంది దుక్కాన్ని. కడుపులో యింగిలం తగిలినట్టు మండి పోయింది బిడ్డ ! తింటేవొట్టు, నిదరపడితే వొట్టు. తిరిగీ తిరిగీ ఓ దొరబాబును గుంజకొచ్చినా, యిద్దరికీ కలిపినా ! సల్లగా బతకమని పంపించినా ! ఇప్పటికి నలుగురు కూనల్ని యెత్తు కొందా తల్లి !"

"ఎంతమంచిదానివి సూరమ్మా నువ్వు !" అన్నాడు శంకరం నిట్టూర్చినట్లుగా నటిస్తూ "నాపాపం యెప్పుడు పండు తుందో తెలీకుండా వుంది. ఓ మాటలేదు, పలుకులేదు. రాత్రి పదింటికీ పన్నెండింటికీ వస్తుంటాడు. ఒక్కోరాత్రి అసలే రాడు. ఇదేమిటంటే కసురుకుంటాడు. ఈమధ్య చెయ్యిచేసు కోవటంకూడా సాగించాడు.

"నాకన్నీ తెలుసు బిడ్డా!" అన్నది సూరమ్మ.

"ఓసి గుడిసేటిదానా!" అనుకున్నాడు శంకరం.

"కూటికోసం నేనిక్కడపడివుంటున్నానా సూరమ్మా? నాకేమాత్రం తిండిదొరక్కపోతుందా ఈ ప్రపంచంలో?" అన్నాడు శంకరం విచారంగా.

"మీకేంనుండీ! నెత్తినపెట్టుకొని సలాంకొట్టే దొరలు లచ్చలున్నారనుకోండీ లచ్చలు! మనసులోమాట నాసెవి నేశారుగందా! మీరట్టా చూస్కుంటావుండండి. మిమ్మల్ని పూలమీన నడిపియ్యపోతే నన్ను చెప్పతీసుకు తన్నండి!" అన్నది సూరమ్మ.

"ఇంతకాలంనుండీ నేనూ కడుపులోపెట్టుకొని వూరు కుంటున్నాను సూరమ్మా! ఎన్నాళ్ళిలా కుక్కలా బతకను? పుట్టింటి కెడదామా అదో అడివి. ఇక్కడచూస్తే కొరివి" అన్నాడు శంకరం.

"ఎవరు కన్నబిడ్డవయితేనేం తల్లీ మనసులోమాట అన్నావు. నాచాతనయింది నేచేస్తా. అన్నిటికీ దేవుడే వున్నాడు."

"ఇంద ఈఅయిదూ వుంచుకో!"

శంకరం అయిదు రూపాయలనోటు యిచ్చాడు. సూరమ్మ ఒద్దు ఒద్దు అంటూనే రొంటిని దోపుకొని వెళ్ళి పోయింది.

"ఏం మనుషులురా భగవంతుడా!" అనుకొన్నాడు శంకరం నీరసంగా కుర్చీలో జారగిలబడుతూ.

*　　*　　*

రిక్షా ఆఫీసు ముందాగింది.

సత్యవతి రిక్షాదిగింది. కాలుకింద పెడుతూనే ఓసారి పమిటను సరిచేసుకొందుకు యెడంచేతిని భుజంమీదికి చేర్చి సర్దుకొంది. ఆ భుజంమీద కోటున్న సంగతి అప్పటిదాకానీ గుర్తుకు రాలేదు.

'ఆదిలోనే హంసపాదు' అనుకొన్న దావిడ. రిక్షా వాడికి డబ్బు లిచ్చేసి ఫైలు చేతబుచ్చుకొని పదడుగులు నడిచిందో లేదో తెల్లటోపీ పెట్టుకొన్న జమానొకడు పరుగెత్తుకొంటూ యెదురొచ్చి ఠకామని ఆగి ఓ అధ్వాన్నపు శాల్యూట్‌కొట్టి చెయ్యి చాపాడు.

"ఏమిటి" అన్నట్టు చూసింది సత్యవతి.

వాడి చూపులు ఫైలుమీద వాలాయి. సత్యవతి ఫైల్ వాడి కిచ్చింది. వాడు ముందు నడుస్తుంటే వెనకాలే తను నడిచింది. దోవపొడవునా చాలామంది ఆవిడకు దణ్ణాలు పెట్టారు. ఆఫీసు హాల్లో కాలు పెట్టిందాకా చెయ్యి వూపుతో నేవున్నది.

అప్పటిదాకా సొల్లు కబుర్లాడుకొంటున్న వారంతా జమాన్ను చూడగానే సిగ్నల్ అందుకున్నట్లు సర్దుకొన్నారు. ఎవ్వరూ సిగరెట్ కాల్చడం లేదుగానీ, హాలునిండా పొగ మాత్రం వుంది. సత్యవతి లోపలికి రాగానే అంతా లేచి నిలుచున్నారు. రెండుమూడు సీట్లు ఖాళీగా వున్నాయి. ఓసారి హాలునంతా పరకాయించిచూసి 'సెక్రెటరీ అని బోర్డున్న రూంకేసి తిరిగింది. ఇందాక ఫైల్ పట్టుకొన్న జమాను స్వింగ్ డోర్సు తెరిచి పట్టుకొన్నాడు. సత్యవతి లోపలికి వచ్చి ఓ నిముషం పాటు అక్కడే నిలబడిపోయింది. ఆవిడ కూచున్నదీ లేనిదీ

తలుపు సందులోంచి చూస్తున్న జవాను గబాలున లోపలి కొచ్చాడు. సత్యవతి చూసినవైపే చూశాడు.

"కరీంగాడు యీపూట రాలేదు సార్. సి.ఎల్. తీసు కొన్నాడు. గురవడు తుడిచేశాడనుకొంటా సార్" అంటూనే జేబుగుడ్డతీసి కుర్చీబల్లలూ మరోసారి తుడిచాడు. యాష్ట్రే శుభ్రం చేశాడు. నీళ్ళ గ్లాసులు పెట్టిన మరకల్ని గోటితో రుద్దాడు. రెండు టెలిఫోన్లను శుభ్రం చేశాడు.

"రెండు ఫోన్లెందుకో ?" అనుకున్నది సత్యవతి.

కుర్చీలో కూచున్నాక గుండె లెందుకో గుబబుబ లాడయి. టేబుల్ అంచున రెండు కాలింగ్ బెల్స్ బటన్లు న్నాయి. ఒకటి యెర్రది, మరోటి పచ్చది. ఏది నొక్కితే యెవరు పలుకుతారో తెలీదు. పావుగంటదాకా చాలా కాళ్లు స్వింగ్‌డోర్స్ వెనక తచ్చట్లాడాయి. ఏ జతా లోపలికి రాలేదు. ఏదయితే అదే అవుతుందని యెర్ర బటన్ నొక్కింది. నిముషం తిరక్కముందే పొడుగాంటి మనిషొకడు ప్రవేశించి దణ్ణంపెట్టి నిలుచున్నాడు.

"నీ పేరేమిటి ?" అందామని నోటిదాకా వచ్చింది సత్యవతికి. ఆ మాటే అనివుంటే యేమయ్యేదో మనం చెప్ప లేం ! ఎవరో గొంతు నులిమి నట్టుగా ఆగిపోయిం దావిడ.

"ఏం సార్ ?" అన్నాడు తను చాలా నెమ్మదిగా.

ఏమనాలో ఓ క్షణం ఆలోచించింది సత్యవతి. ఆ క్షణ కాలంలోనూ ఆవిడ మనస్సులో లక్ష ప్రశ్నలయినా మెది లుంటాయి.

"అందరూ టైముకే వస్తున్నారా?" అన్నది సత్యవతి.

"చాలామంది క్రైముకే వచ్చారనుకుంటాను సార్ !" అన్నాడతను.

"మరి వెంకటరత్నం మాటేమిటి ?" అందామనుకొంది సత్యవతి ఈసారి ఎవరో గొంతు నొక్కినట్టుగా ఆగిపోయింది.

"ఈరోజునుండి నేను స్వయంగా హాజరు తీసుకోవాలనుకుంటున్నాను. ఒక్కొక్కరేవచ్చి యిక్కడ సంతకంచేసి వెళ్ళాలి. వచ్చిన క్రైంకూడా వేయాలి"

"అలాగేనండీ !''

"రమ్మను'' అన్నది సత్యవతి ఫైల్ విప్పదీసుకుంటూ.

అతను తిరిగి రెండడుగులు వేశాడో లేదో సత్యవతి మళ్ళా పిలిచింది.

"అందరూ వొకేసారి కట్టగట్టుకొని రానవసరంలేదు. ఒకరి తరవాత మరొకరు రావాలని చెప్పు'' అన్నది సత్యవతి.

"అలా మనవారు రారనుకొంటాను సార్ !'' అన్నాడతను.

"వస్తారని నా నమ్మకం. రెండు నిమిషాలకిందటే మీరంతా గుంపులుపడి కూచోవడం నేనూ చూశాను. అందుకని ఆ విషయంకూడా మీకు స్పష్టంచేద్దామనుకొన్నాను. మరి వెళ్ళండి !"

అతను వెళ్ళిపోయాడు.

ముందుగా ఓ లావాటి వృద్ధుడొచ్చాడు. నమస్కారం చేసి, బల్లమీదున్న కాగితంమీద దస్కతుపెట్టి, క్రైంవేసి వెళ్ళాడు. అతను రాఘవయ్య. ఆ తరువాత గంగనామాలతను

వచ్చాడు. ఆయన సీతారామాచార్యులుగారు. మూడో అతను రామారావు అని సంతకం వేశాడు. అతనింతకుముందే వచ్చిపోయాడు. నాలుగోవాడు ముకుందం. చాలా చిన్న కుర్రవాడు. అయిదో వ్యక్తి సుమతి. ఆవిడ సంతకంచేసి వెళ్ళ బోతూవుంటే, కూచోండి. మీతో మాట్లాడాలి, అన్నది సత్యవతి.

సుమతి నిలబడిపోయింది.

"మీ రిక్కడ ఎంత కాలంనుండి పనిచేస్తున్నారమ్మా?" అన్నది సత్యవతి ఆవిణ్ణి ఆపాదమస్తకం పరిశీలనగా చూస్తూ.

సుమతి తలవంచుకొని నవ్వింది.

"అలానవ్వితే నాకర్థంకాదు. దయచేసి చెప్పాలి!" అన్నది సత్యవతి.

"అబ్బ! నన్ను వెళ్ళనీండి! ఇప్పటికే నన్నుగురించి వెంకటరత్నం గారుకూతలన్నీ కూస్తున్నాడు. ఇలా మనం మాట్లాడుతూ కూచుంటే, వాడు గోడలమీదకూడా రాస్తాడు" అన్నది సుమతి.

సత్యవతి తల పంకించింది.

"ఇంకా సంతకం పెట్టవలసిన వాళ్లెంతమందివున్నారు?" అన్నది సత్యవతి.

"నలుగురు" అంటూనే సుమతి వెళ్ళిపోయింది.

ఇద్దరు వెంటనేవచ్చి దస్కతులుచేసి వెళ్ళిపోయారు. మూడో అతను పావుగంట తరవాత వచ్చాడు. దస్కతు పెట్టి, పదిన్నరకే వచ్చినట్టు టైంవేశాడు.

"మీరొచ్చేది యిప్పుడే గదా, యిందాకనే వచ్చినట్టు ఫైంవేశారేం" అన్నది సత్యవతి.

"నేను వచ్చి చాలాసేపయిందండీ!" అన్నాడు కాశీపతి.

"మరి సీట్లో లేరే?" అన్నది సత్యవతి.

"ఇంట్లో యిబ్బందిగావుండి భోజనంచేయలేదు సార్! కాఫీ తాగుదామని వెళ్ళాను."

"ప్యూన్‌తో తెప్పించుకోలేకపోయారా" అన్నది సత్యవతి నీ దొంగవేషాలు నాదగ్గర సాగవన్నట్టు.

"ఆఫీసు బంట్రోతును సొంతపనులకు వాడుకోవటం నా కిష్టంలేదు సార్. అలా చెయ్యమని మీరో ఆఫీసార్డరి స్తే అంతే చేస్తాను సార్!" అన్నాడు కాశీపతి.

సత్యవతికి నవ్వొచ్చింది.

"ఇంకా ఒకరు రావాలి. అతనెక్కడండీ?" అన్నది సత్యవతి.

"వెంకటరత్నం సంగతాండి? వాణ్ణిగురించి మీకు తెలియందేమున్నది సార్! ఎప్పుడొస్తాడో, ఎప్పుడు పోతాడో తెలీదు."

"మంచిది. అతను రాగానే, నేను పిలుస్తున్నానని చెప్పండి" అన్నది సత్యవతి.

ఆవిడ ఈ సంతకాలసేకరణ ఎందుకు పెట్టిందీ తెలియక సెక్షనంతా మల్లగుల్లాలుపడింది.

"అయ్యగారు వానపాములాంటివాడనుకొన్నాంగానీ, తాచుపామురోయ్. శ్రీమద్రామానుజాయనమః!" అన్నాడు సీతారామానుజాచార్యులవారు.

"ఏమిటి ?" అని ఓసారి కళ్ళజోడులోంచి అటూ ఇటూ చూసి తల ముందుకూ వెనకకూ తిప్పుతూ "అవును గదూ ! వానపాము, తాచుపాము. చూశారా గమ్మత్తు ? అక్కడ పామే, ఇక్కడా పామే ! అవునవును. బావుంది బావుంది !" అన్నాడు రాఘవయ్య.

ముకుందం కాగితాలన్నీ బొత్తిపెడుతూ మధ్యమధ్య సుమతికేసి చూసి గుటకలుమింగుతున్నాడు.

"ఈ రోజుల్లో వుద్యోగాలు, ప్రమోషన్లు ఆడవాళ్ళ కేనోయ్ !" అన్నాడు సీతారామానుజాచార్యులు.

"ఎందుకనంటావ్ బాబాయ్?" అన్నాడు ముకుందం, సన్నగా కన్నుకొట్టి.

"బిడ్డ ! భగవంతుడు వారికిచ్చిన వరం అటువంటిది, అక్షయపాత్ర కదటోయ్ నాయనా ! శ్రీమద్రామాను జాయనమః" అన్నాడు ఆచార్యులు.

"ఏమిటి?ఏమిటేమిటి? అక్షయపాత్రనిగదూఅన్నావ్. బావుంది బావుంది. బ్యూటీఫుల్. అవునవును. పాత్ర, పాత్ర" అని గుటకలువేశాడు రాఘవయ్య.

కాశీపతి యీ గొడవలోకి రాదలచలేదు. ఫైళ్ళన్నీ పక్కకుపెట్టి, తాపీగా పేపరు చదువుకొంటున్నాడు.

రామారావుకు ఈ కదంబకార్యక్రమంలో పాల్గొనా లన్న ఆసక్తి లేదు; అంత వెసులుబాటూ లేదు. రాసుల్లావచ్చి దూకుతున్న కాయితాలన్నీ ఓపిగ్గా చదువుతున్నాడు.

సుమతి బల్ల ఓమూలగావుంది. అందరికన్నా రామా రావు ఆమెకు దగ్గరగావున్నాడు.

ఏదన్నా కావాలంటే సుమతి అతన్నడుగుతుంది. రామారావు తప్పకుండా ఆమెకు సహాయపడతాడు. అలా సహాయపడటం వెనక చాలాగాథ వున్నదంటారు చాలామంది. ఈ గాథాక్రమానికి ప్రారంభోత్సవం చేసినవాడు వెంకట రత్నం.

"బాబాయ్ !" అన్నాడు ముకుందం.

"ఏం బిడ్డా ?" అన్నాడు ఆచార్యులు.

"పరస్పర విరుద్ధమైనశక్తులు దగ్గరగా ఆకర్షింపబడతాయనడంలో నిజంలేదు బాబాయ్ !" అన్నాడు ముకుందం.

"నిజం బిడ్డా !"

"ఎందుకనో అడగవేం బాబాయ్ ?"

"చెప్పు బిడ్డా చెప్పు" అన్నాడు ఆచార్లు.

"ఓ చెంప చూస్తూనే అడుగుతుంటే యేమని చెప్పను బాబాయ్ ?"

కాశీపతి [illegible]వే[illegible]డు.

"ఓరి పిడికడుపు పుక ! కెన్నడీ వాషింగ్టన్‌లో దంచేశాడోయ్ ! ఎలాగైనా అమెరికావాడు అమెరికా వాడే !" అన్నాడు కాశీపతి.

"ఫార్మోజాదీవుల్ని రక్షించవలసిన నైతిక బాధ్యత అమెరికాకు వున్నదన్నాడయ్యా రాఘవయ్యా! హైడ్రోజను బాంబులాంటి ముక్క పడేశాడు. ఇంతకన్నా యింకేమనాలి నా పిండాకూడు ?"

"అవునవును పసందైనముక్క పడేశాడుగదూ మరి?" అన్నాడు రాఘవయ్య.

"ఏమోయ్ రామారావ్! ఈ ముక్క వినవోయ్, నీకు పనికొచ్చేదే!' అన్నాడు కాశీపతి.

రామారావు తలెత్తిచూశాడు. మెడనరాలు కిరకిర మన్నాయి. తలను అటూ యిటూ తిప్పి విరచుకొన్నాడు.

"సంతులేనివారికి సంతును ప్రసాదించు మందు, హిమాలయాల్లోని మహర్షులవలన వుపదేశంపొందిన వ్యక్తి దీన్ని తయారుచేశాట్ట. పనిచెయ్యకపోతే డబ్బువాపసు ఇవ్వడమే కాకుండా, వెయ్యిరూపాయల బహుమానంకూడానట! పోనీ ట్రైచెయ్యరాదుటోయ్!" అన్నాడు కాశీపతి.

రామారావు యేదో అనబోతుండగానే గంట మోగింది.

"పోనాయనా పో! అదృష్టవంతుడివి!" అన్నాడు ఆచార్లు.

రామారావు నవ్వుకొంటూ లోపలికొచ్చాడు. సత్యవతి యేవో కాయితాలు చూసుకుంటూవుంది.

"పిలిచారా సార్?" అన్నాడు రామారావు.

సత్యవతి అప్పుడు తలెత్తింది.

"మీరొచ్చారేం?" నేను సెక్షన్ హెడ్డును పిలిచాను' అన్నది సత్యవతి.

రామారావు అనవసరంగా గుటకవేసి నిలబడ్డాడు.

"కాశీపతిగార్ని పిలవమంటారా?" అన్నాడు రామారావు.

"అసలు నేను పిలిచిందే వార్ని, సెక్షన్‌లో లేరా?" అన్నది సత్యవతి.

"ఉన్నారండీ?"

"ఏంచేస్తున్నారట?" అన్నది సత్యవతి కనుబొమలు చిట్లించి.

"నాకు తెలియదు సార్!"

"నీకు తెలియవలసిన అవసరంలేదు. ఈ సారి బెల్ కొట్టినప్పుడు నువ్వు రావలసిన అవసరంకూడాలేదు, అతన్ని పంపించు." అన్నది సత్యవతి బిగ్గరగా.

ఈమాట సెక్షనంతా వినిపించింది!

"బాబాయి!" అన్నాడు ముకుందం.

"శ్రీమద్రామానుజాయ నమః" అన్నాడు సీతారామానుజాచార్యులవారు.

కాశీపతి విసుక్కుంటూ పేపరు కూడా వదిలేసి ఓ ఫైలు పుచ్చుకువచ్చాడు

"ఈ బెల్ మీకోసం పెట్టిందేకదండీ? కొట్టినప్పుడు రారేం?" అన్నది సత్యవతి.

కాశీపతి నిర్విణ్ణుడయ్యాడు. అతని సర్వీసులో యింత నిక్కచ్చిగా అడిగినవారెవ్వరూలేరు. ఈ శంకరంగాడైనా యీనాడు అడిగాడుగానీ, యిదివర కెప్పుడూ అనలేదు.

"అంటే" అన్నాడు కాశీపతి అయోమయంగా.

"మీకు తెలుగుకూడా అర్థంకాదని నాకు తెలీదే! ఈ బెల్ కొట్టినప్పుడు మీరు రావాలి. రామారావుని పంపుతారెందుకు?" అన్నది సత్యవతి గట్టిగా.

"తమకు తెలియందేమున్నదండీ! బోలెడన్ని అర్జెంటు కాగితాలుంటాయి. మధ్యలో రావడమెందుకని, అతన్ని

పొమ్మని నేనే చెప్పాను. అయినా యివ్వాళ కొత్తకాదు గదా సర్! చాలా కాలంనుండి యిది జరుగుతూనేవున్నది గదండి?" అన్నాడు కాశీపతి.

"చాలా కాలంనుండి అమల్లోవున్న ప్రతిదీ మంచిదను కోవడం పొరపాటు. మీరేదో అర్జెంటు కాగితాలు చూస్తు న్నామన్నారే, యేమిటండీ అవి?" అన్నది సత్యవతి.

"ఎవరో మిల్లర్సు లైసెన్సులకోసం అప్లయిచేశారండీ, అవి చూస్తున్నాను" అన్నాడు కాశీపతి కాస్తంత గట్టిగా.

"నోరు హెచ్చుపెంచి మాట్లాడకండి. నాకు చెముడు లేదు. ఆ అప్లికేషన్సులో కెన్నెడీ స్టేట్‌మెంటు, పిల్లలుపుట్టే మందుల ప్రకటన కూడా రాశారా?" అన్నది సత్యవతి.

మీరలా ప్రతివిషయంలోనూ జోక్యం కలుగజేసు కోవడం బావుండదుసార్! ఓపని చెయ్యమని నాకొప్పగించి నప్పుడు, ఆ బరువూ బాధ్యతా నాదేగదండీ! దాన్ని నేనూ పూర్తి చేయవచ్చు, ఇతర్లతో చెప్పి చేయించనూవచ్చు. మీరలా నిక్కచ్చిచేస్తే చేసినట్టేఉంటుంది!" అన్నాడు కాశీ పతి పోవటానికి వెనక్కు తిరుగుతూ.

"ఆగండి మీతో ఇంకా మాట్లాడాలి పొమ్మనందే పోతారెందుకు?" అని బిగ్గరగా అరిచింది సత్యవతి.

కాశీపతి భగ్గుమని మండిపోయాడు.

"పొరపాటే! ఇప్పుడు చెప్పండి!" అన్నాడు కాశీపతి, అతి వినయంగా ముందుకు వంగి.

"ఆఫీసు బంట్రోతుచేత కాఫీ తెప్పించుకోడానికే

మనస్కాప్ప లేదన్నారుగదా, ఆఫీసుటైంలో పేపరెలా చదువు తున్నారు?" అన్నది సత్యవతి.

"మాల్సు మాకేకాదండి అందరికీ క లే నండీ !" అన్నాడు కాశీపతి.

సత్యవతి ఫక్కున నవ్వింది.

"నా బల్లమీదున్న పేపరు చూసే మీరీమాట అన్నా రనుకుంటాను. మీరిలా అంటారనికూడా నాకు తెలుసు అందుకే రేపట్నించీ పేపరు నారూంలోకి తీసుకురావద్దని జవానుతో చెప్పారు."

"రోజూ సంగతేమిటండీ ? ఇదివరకు మీరూ చదివే వారుగా?" అన్నాడు కాశీపతి.

"అప్పుడు నేనూ మిమ్మల్ని అడగలేదుగదా ?" అన్నది సత్యవతి.

"మంచిది సార్. మరి నేను వెళ్ళనా."

"ఇంకోసారిలా అనకండి. మీరెప్పుడు వెళ్ళవలసిందీ నేను చెబుతాను వెంకటుంత్నంవస్తే ఓసారి రమ్మనండి."

"అలాగేనండీ !"

"వెళ్ళవచ్చు."

కాశీపతి దఢాలున తలుపులుతీసుకొని పెద్దచప్పుడుతో అడుగులు వేసుకొంటూ వెళ్ళాడు. రెండుమూడు నిమిషాల తరవాత, యెవరిమీదనో అతను కేకలువెయ్యడం సత్యవతికి వినిపించింది.

"సుదర్శనంగా రొచ్చారు సార్?'' అన్నాడు జవాను మెల్లగా.

"ఏ సుదర్శనం?" అన్నది సత్యవతి. జవాను తెల్ల బోయాడు.

"ఎవరోయి? లక్షమంది సుదర్శనా లున్నారు..." అన్నది సత్యవతి.

"వారేసార్! నిన్నకూడా తమతో చాలాసేపు మాట్లాడరండీ!"

"ఓహో! అన్నది సత్యవతి, ఇప్పుడే ఆతనెవరో జ్ఞాపకం వచ్చిన దానిలాగా. సుదర్శనం వచ్చాడు. వస్తూనే దణ్ణం పెట్టాడు. చేతిలోవున్న సంచిని బల్లమీద పడేశాడు. అనవసరంగా ఒక నవ్వు నవ్వాడు.

"చెప్పండి!" అన్నది సత్యవతి, అతన్ని ఎగాదిగా చూస్తూ.

సుదర్శనం దిమ్మరపోయాడు. అదేపనిగా సత్యవతి వంక చూశాడు.

సత్యవతికి ప్రాణం వుడుకుడిచినట్లుగావుంది. గదిలో యెవ్వరూలేరు. అతనూ, తనూమాత్రమే వున్నారు. పమిట సరిచేసుకొంది. గాజుల్ని వెనక్కు నెట్టుకొంది. కాళ్ళురెండు ముడుచుకొంది.

"చెప్పండిసార్!" అన్నది గంభీరాన్ని తెచ్చిపెట్టు కొంటూ.

"నిన్నదాకా విషయమంతా చెప్పానుకదండీ!" అన్నాడు సుదర్శనం.

"బొత్తిగా జ్ఞాపకంలేదు. అంటే...!" సత్యవతి పచ్చబటను నొక్కింది. జవాను వచ్చాడు. రామారావును

పిలవమన్నది. అతనొచ్చాక, వీరి విషయం చూడండి రామా రావుగారూ!" అన్నది సత్యవతి.

"అలాగే!" అన్నాడు రామారావు. "మీరుపదండి సార్! నేనిప్పుడే వస్తాను."

సుదర్శనం మరోసారి దణ్ణంపెట్టి వెళ్ళిపోయాడు.

"ఏమిటండి యితని వ్యవహారం?" అన్నది సత్యవతి.

"రెండు రైస్‌మిల్లులకు లైసెన్సులుకావాలని అప్లయి చేశాడండి!" అన్నాడు రామారావు.

"ఊఁ" అన్నది సత్యవతి.

"అంతేనండి!"

"తరవాత?" అన్నది సత్యవతి, యేదో కాయితం చూస్తున్నట్లు నటిస్తూ. చెవులు మాత్రం యిక్కడే వున్నాయి.

"బాయిలర్లు బాగా లేవని యింజనీరింగ్ సెక్షన్‌వారు రిపోర్టుచేశారండి!"

"బాగ లేకపోతే లైసెన్సునెలా యిస్తారండీ!"

"తెలీదండీ!" అన్నాడు రామారావు.

"తరవాత?"

"అంతేనండీ!" అన్నాడు తను.

"నాకు తెలియందేముంది రామారావ్? నేనూ అనుమానించాను; కానీ, నిజమా అబద్ధమా అన్నది తేల్చుకోలేదు..." అన్నది సత్యవతి సన్నగా నవ్వుతూ. "ఆమాట నిజమేనా?"

రామారావుకూడా నవ్వాడు.

"కాశీపతిగారు కొంతపుచ్చుకొన్నాడటండీ ! మంచి రిపోర్టు రాయించుకొంటానన్నాట్ట. ఆ సెక్షన్‌లో అతని కజిన్ వున్నాడండీ ! మనం మిగతాదంతా పూర్తిచేస్తే సరిపోతుం దండీ ?" అన్నాడు రామారావు.

"ఇప్పుడా ఫైల్ యెక్కడుంది ?"

"నాదగ్గరే వుందిసార్ !"

"లేదని చెప్పు. అతను మనచుట్టూ తిరగనవసరంలేదు. మనమే కబురుచేస్తామని చెప్పు.. అన్నదావిడ.

"సుదర్శనంగారిని పంపుతాను, మీరు మాట్లాడితేనే బావుంటుందండీ !" అన్నాడు రామారావు.

సుదర్శనం రానేలేదు. అతను కాశీపతిగారితో మాట్లాడి వెళ్ళిపోయాడు. సత్యవతి ఆ ఫైలు తెప్పించి, లైసెన్సులు యివ్వడానికి వీల్లేదని రాసింది. కాశీపతి లబలబ లాడుతూ వచ్చాడు.

"ఇందులో మీరంత బాధపడటమెందుకండీ ! అత నిచ్చిన మొత్తంలో యేమన్నా ఖర్చుచేస్తే చెప్పండి. ఆ లోసుగు నేను పూడుస్తాను. అధ్వాన్నపు మిల్లులకు లైసెన్సు లిచ్చి యెవరిప్రాణాలు తీద్దామని మీ వుద్దేశ్యం ! అన్నది సత్యవతి

"సుదర్శనంగారికి లైసెన్సులురావని మనమనుకోవడం భ్రమసార్ !"

"చూద్దాం !" అన్నది సత్యవతి.

కాశీపతి నిలబడేవున్నాడు.

"వెళ్ళండి !"

అరగంటకల్లా ఫోన్‌లో పెద్దదొరగారినుండి పిలుపు వచ్చింది.

"మూడు వారాలనుండి సుదర్శనం లైసెన్సుకోసం ఎప్లయిచేసిన ఫైల్ కదల్లేదని, పి. ఏ. గారడగుతున్నారు. వెంటనే శాంక్షన్ చేసి, యీ రోజునే డిశ్పాచ్ అయ్యేలాగా చూడండి!" అన్నాడు శెక్రెటరీ.

సత్యవతి నిలువునా కుంగిపోయింది. ఆవిడ తలలో రొద ప్రారంభమయింది. కణతలు పట్టుకొని, మోచేతులు బల్లమీద ఆన్చి కళ్ళు మూసుకొంది.

"కాఫీ తెమ్మంటారా సార్." అన్నాడు జవానూ.

తెమ్మన్నట్టుగా తలతిప్పింది సత్యవతి.

"తలకాయ నొప్పుతుందా సార్?"

అవునన్నట్టుగా తాడించింది.

"ఈపొద్దు మీరసలు సిగరెట్టే కాల్చలేదు సార్! నిండాపనిలో మునిగిపోయారు!"

"తీసుకురా!" అన్నది సత్యవతి.

జవానుపోతూనే మరో అతను లోపలికొచ్చాడు.

"పిలిచారట సార్?" అన్నాడతను.

సత్యవతి అతన్ని ఎగాదిగా చూసింది. శంకరంచెప్పిన గుర్తులు జ్ఞాపకంవచ్చాయి. బహుశా ఇతను వెంకటరత్నం కావచ్చు ననుకొన్నది.

"మీరిప్పుడే వస్తున్నారా?" అన్నది సత్యవతి, ఆయన కేసి చూడకుండానే.

"రైట్‌టైంకే వచ్చాను సార్!"

"మరి కనిపించలేదేం ?"

"రికార్డు రూం కెళ్ళాను."

"మూడుగంటలసేపూ మీరక్కడే వున్నారా ?" అన్నది సత్యవతి.

"లేను. నా స్వంతపనివుంటే చూసుకొనివస్తున్నాను" అన్నాడు వెంకటరత్నం.

"అందరికీ సొంతపనులుంటాయికదా? వాళ్ళందరూ వేళకు రావడం మానేయలేదే! మీరుమాత్రం యిలా ఎందుకు రావాలి?"

వెంకటరత్నం అలా ఆశ్చర్యంగా సత్యవతికేసి చూశాడు. అతని కళ్లు ఎర్రబడ్డాయి. ఆ చూపులికి సత్యవతి తట్టుకోలేకపోయింది.

"పిల్లల్ని మందలించినట్టు మందలిస్తారేమిటండీ? నేను ఇందాకణ్ణించీ సీట్లో నేవున్నాను. కాదన్న దెవడో రమ్మనండి! నేను చూస్తాను" అన్నాడు వెంకటరత్నం.

"నేనంటున్నానయ్యా చాలా ?"

"మీరంటే ఏమయినట్లండీ! మీరన్నదల్లా నిజమూ, మేమన్నదల్లా అబద్ధమూ అయిపోతుందంటారా? నేనంటే గిట్టకనే మీరిట్లా అంటున్నారని నేనూ అంటాను" అన్నాడు వెంకటరత్నం జంకూ గొంకూ లేకుండా.

అతనెంత మొండివాడో సత్యవతికి బోధపడింది. అయినా యింకోసారి పాడివేసి చూదామనుకొంది.

"ఈ పప్పులేమీ నాదగ్గర వుడకవ్ వెంకటరత్నం! నీమీద రిపోర్టు రాశానంటే సర్వనాశన మయిపోతావ్!

పిల్లలుగల వాడివి నీపొట్టమీదకొట్టటం నాకిష్టంలేదు. నీమేలు కోరి చెబుతున్నాను ఇలా ఎప్పుడూ చెయ్యకు. ఇకవెళ్ళు" అన్నది సత్యవతి.

వెంకటరత్నం అక్కణ్ణించి కదల్లేదు.

"మీరంతదాక వెడితే నేనింకా దూరం వెళ్ళాలి సుంటుంది సార్! మీమీద నేనూ రిపోర్టు రాస్తాను. అంత చేతులుచచ్చి కూచోలేదు" అన్నాడతను రొప్పుతూ.

ఆ క్షణాన వెంకటరత్నం కళ్ళు తోడేలు కళ్ళలా కని పించాయి సత్యవతికి.

"ఏమని రాస్తావోయ్ నామీద?" అన్నది సత్యవతి రెచ్చిపోయి.

"పిల్లి పాలుతాగుతూ ఎవ్వరు చూడటంలేదనుకొంటే లాభంలేదండీ! సుమతికీ మీకూ సంబంధాలున్నాయన్న సంగతి అందరికీ తెలుసు. ఈమాటే రాస్తాను. అవసరమయితే అనేకసార్లు చూశాననికూడా రాసేస్తాను" అన్నాడు వెంకట రత్నం.

సత్యవతి గుండె జారి, దాదాపు మోకాళ్ళదాకా వచ్చింది. వెంకటరత్నాన్ని రెచ్చగొడితే సుమతి విషయం తేలి పోతుందనుకొంది. లేనికోపాన్ని నటిస్తూ బల్లమీద గుద్దింది.

"అబద్ధం. అలా ఎన్నడూజరగలేదు"అన్నది సత్యవతి.

"జరిగిందని నేనుమాత్రం అన్నానా సార్! మీరు రిపోర్టు రాస్తానంటే, నేనలా అన్నానుకాని,—" అన్నాడు వెంకటరత్నం.

"సరే వెళ్ళు. నీపని చూసుకో. ఇంకెప్పుడూ అలా చెయ్యకు" అన్నది సత్యవతి.

ఈ సంభాషణవల్ల సుమతిని గురించి తనకు కొత్తగా తెలిసిన సమాచారమేమీ లేదు. తన జీవితం – మరీ యింత అధ్వాన్నం కావడానికి, తను సుమతే కారణమనుకొంటూ వుంది. నిజంగా ఆవిడే కారణమో కాదో తెలుసుకొనేందుకు అవతారాలు మారాలనుకొంది. అదయ్యాకకూడా, ఇంత వరకూ పిసరంత తేలలేదు. కానీ, లేనిపోని పేచీలుమాత్రం చాలా తెచ్చిపెట్టుకొంది. మొదటిరోజు గనకనే తనిలా అనుకొంటూవున్నదో, నాలుగురోజులయ్యాక ఈ వాతావరణం బాగావుంటుందో తను చెప్పలేకుండావుంది. అయితే ప్రతి రోజు యింతరభసా తప్పనిసరైతేమాత్రం, ఈ ఉద్యోగంలో వుండటం చాలాకష్టం.

"కాఫీ పొయ్యమంటారా సార్!" అన్నాడు జమాను. "ఊఁ" అన్నది సత్యవతి. జమాను కాఫీ కప్పులో పోశాడు. కాని యింకా కొంతకాఫీ ఫ్లాస్కులో మిగిలిపోయింది. అది కూడా పొయ్యమని నోటిదాకా వచ్చింది. ఆసరికే వాడు ఫ్లాస్కును పక్కగదిలోకి తీసుకెళ్ళాడు. సత్యవతి కాఫీ తాగింది. ఈలోగా నాలుగుసార్లు ఫోను మోగింది. ఒకసారి ఎస్టిమేషన్ ఫైలు పూర్తిచేసి పంపమని అడిగారెవరో. మరో సారి సాయంత్రం మూడుగంటలకు ఇంటర్వ్యూ కొస్తారనీ సిద్ధంగా వుండమనీ, ఇంకో సెక్రటరీ ఫోను చేశాడు. మిగిలినవి రాంగ్ నెంబర్లు.

"దిక్కుమాలిన ఉద్యోగం, తీరిగ్గా కాఫీ తాగడానికి కూడా లేదు" అని విసుక్కుంది సత్యవతి!

కాఫీతాగి అలవాటుప్రకారం పమిటచెంగుతో మూతి తుడుచుకోబోయి ఫక్కుమని నవ్వుకుంది. కోటు కుర్చీకి వేళ్ళాడుతూ, తనను వెక్కిరించినట్లనిపించింది సత్యవతికి

సాధారణంగా, కాఫీతాగాక సిగరెట్ కాల్చడం మగవాళ్ళ కలవాటుగనక, తనూ ఓ సిగరెట్ వెలిగించా లనుకొంది సత్యవతి. ఆ ఆలోచన రాగానే ఆవిడకు సిగ్గు ముంచుకొచ్చింది. తను సిగరెట్ కాల్చడం ఎరిగిన వారెవ రన్నా చూస్తే, ఫలానా శంకరంగారి భార్య, బరితెగించి సిగరెట్లుకూడా కాల్చేస్తుందనుకొంటారేమోనన్న ఆలోచన కలిగింది. కానీ ఇప్పుడలా అనుకోవడానికి అవకాసంలేదు గదా! తనిప్పుడు శంకరంగారే! తను అదేపనిగా సిగరెట్లు కాల్చాలి కాల్చకపోతేనే విడ్డూరంగానీ, కాలిస్తే కాదు. అప్పటికీ జమాను ఓసారి జ్ఞాపకంకూడా చేశాడు.

సత్యవతి సిగరెట్ తీసి, పెదవులమధ్య బిగించి, అగ్గి పుల్ల గీసింది. సిగరెట్ అంటిస్తున్నప్పుడు ఆవిడ చేతులు వణి కాయి. అటూ ఇటూ బిత్తరచూపులు చూసింది. ఎవ్వరూ ఆవిణ్ణి గమనించలేదనుకొన్నతరువాత, మెల్లగా లోపలికి పొగ పీల్చింది. ఓక్షణంసేపు ఏమయిందో ఆవిడకు తెలీదు. పొగ గొంతులోకిపోయి ఉక్కిరిబిక్కిరయింది. ఆసరికి సిగ రెట్కూడా పెదవులమధ్య బిగించినంతమేరా తడిసి, నాని పోయింది. నాలుకమీదకు నాలుగైదు పొగాకు పోలుసులు ఊడొచ్చాయి. సిగరెట్కాస్తా జారిపోయింది. దాదాపు

అయిదారు నిమిషాలదాకా ఆవిడ అదేపనిగా దగ్గసాగింది. అప్పటిగ్గానీ జమాను లోపలికిరాలేదు.

"ఏంసార్?" అన్నాడు వాడుభిడియపడుతూ.

సత్యవతికి ఏమనడానికి తోచలేదు. సిగరెట్ కాల్చడం వల్లనే తనకు దగ్గొచ్చిందనిచెబితే వాడు నమ్మడు. న్యాయానికి తాను—అంటే శంకరం — రోజూ యిది చేసున్నపనే నాయెను. ఎలా చచ్చేట్టు.

"నాకేమిటో వొంట్లోబాగాలేదోయ్! ఇంటికెడతాను" అన్నదిసత్యవతి. తొందరగా కొంప కెడదామని.

"రామారావుగారిని పిలుస్తానుసార్? ఈపూట...?" అన్నాడు జమాను.

సత్యవతికి మళ్ళీ దగ్గువచ్చింది. ఆవిడకళ్ళు నీటితో నిండిపోయాయి.

జమాను వెళ్ళి రామారావును పంపించాడు.

"నేను వెళ్ళనా రామారావుగారూ?" అన్నది సత్యవతి గొంతును రాచుకొంటూ.

ఇంటర్వ్యూలు ఈపూటనే సార్! మీరు తప్పకుండా ఉండాలండీ! ఇప్పటికే చాలామంది కాండేట్సు వచ్చారండీ! అన్నాడతను.

"ఓహో!" అన్నది సత్యవతి.

అన్నదేగనీ, ఆవిడ మనస్సంతా పరమగందరగోళంగా వుంది. అసలు ఈ ఇంటర్వ్యూ లెందుకు జరుగుతున్నాయో తెలీదు. ఆ సమయంలో యేంచెయ్యాలో రామారావు సహాయం తీసుకోమని శంకరం చెప్పాడు. ఆ సలహాను అక్ష

రాలా పాటించింది సత్యవతి. అసలు విషయమేమిటో చెప్ప మనీ, తనకిదంతా నానాగొడవగానూ వున్నదనీ అనేసింది.

న్యాయంగా సత్యవతి ఈమాట లనకూడదు. తనిక్కడ శంకరంగా వ్యవహరిస్తున్నదిగానీ, సత్యవతిగా కాదుగదా! శంకరానికి ఈగొడవలేమీ తెలీకపోవడమన్నది సత్యవతికి విరుద్ధమైన సంగతి. ఏ చవటవిన్నా దీన్ని నమ్మడు. రామా రావూ నమ్మలేదు. నమ్మలేకపోగా, సత్యవతికేసి చాలా అనుమానంగా చూశాడు. సత్యవతి వొంటిమీద గొంగళి పురుగులు పాకినట్లనిపించింది.

"అదేమిటి సార్ అలా అంటారు? పని చాలా ఎక్కు వగా వుందనీ, మరో హ్యాండ్ కావాలనీ మీరేగదండీ రాశారు? గవర్నమెంట్ హ్యాండ్స్‌ను శాంక్షన్ చేసింది. మనం ఎంప్లాయ్‌మెంటు ఎక్స్ఛేంజీని అడిగాం. వాళ్ళు మను షుల్ని పంపించారు. ఇవ్వాళే ఇంటర్వ్యూ" అన్నాడు రామారావు.

అతనేధోరణిలో అన్నది సత్యవతిగమనించలేకపోయింది.

"కృష్ణమూర్తిగారుకూడా వచ్చారండీ!" అన్నాడు రామారావు.

అతనెవరుట అన్నది సత్యవతి.

రామారావు దిమ్మరపోయాడు. కన్నార్పకుండా సత్యవతికేసి చూడసాగాడు. సత్యవతి కృష్ణమూర్తి వచ్చా డంటే, చాలా సహజంగా అతనెవరని అడిగింది. రామా రావు ధోరణి చూస్తుంటే, అతనెవరో చాలా గొప్పవాడయి వుండాలనిపిస్తోంది. లేదా, అతనికీ శంకరానికీ అంటేతనకూ

చాలాకాలంనుండి పరిచయమయినా వుండివుండాలి. కాని తను పుటుక్కున మాటజారింది. ఇప్పుడేమనుకొంటేమాత్రం యేం ప్రయోజనం ?

"నా వొంట్లో ఏం బావోలేదు రామారావుగారూ! దయచేసి ఓసారి విషయమంతా చెప్పండి. మీకు ట్రబు లిస్తున్నందుకు మన్నించాలి"

రామారావు నిట్టూర్చాడు

"కృష్ణమూర్తిగారు సీతారామాంజనేయులుగారి మేన ల్లుడండీ!" అన్నాడు రామారావుగారు, ఈసరికన్నా తెలి యకపోతుందా అన్నట్లు.

"ఈ సీతారామాంజనేయు లెవరుట ?"

"పి. ఎ. గారి బావమరిది వడ్డకుడండీ! వారికి వుద్యోగమిస్తామని నిన్న మీరు ప్రామిస్ చేశారుకూడానండీ!" అన్నాడు రామారావు.

"ఫలానావాడికి వుద్యోగం యివ్వాలని ముందుగానే నిర్ణయించుకున్నాక ఇంకా ఇంటర్వ్యూలు, మట్టీ, మశానం ఎందుకయ్యా, తగలెయ్యడానికి వాణ్ణొక్కణ్ణే పిలిచి, వుద్యోగంలో చేరమంటే సరిపోదూ ?" అన్నది సత్యవతి.

"ఒక ప్రొసీజరంటూవుంది గదండీ దాన్ని మనం ఫాలోకాక తప్పదు సార్! అలా చేస్తే మనం ఫేవర్ చేసి నట్లు అందరికీ తెలిసిపోతుందండీ!" అన్నాడు రామారావు.

"ఇప్పుడయినా మనం న్యాయంగా ఏడవబోవడం లేదుగా" అన్నది సత్యవతి.

రామారావు పలకలేదు.

"మొత్తం ఎంతమంది వచ్చారండీ ?"

"పదిమంది" అన్నాడు రామారావు.

"ఆ లిస్టోసారి పంపించండి, తరువాత వాళ్ళనుకూడా రమ్మనండి !" అన్నది సత్యవతి.

రామారావు వెళ్ళి, జవానుకిచ్చి లిస్టు పంపించాడు. అందులో స్కూల్ ఫైనల్ దగ్గర్నించీ, యమ్మే చదివిన వాళ్ళదాకా ఉన్నారు. కృష్ణమూర్తి అనేవాడు స్కూలు ఫైనల్ చదివాడు. యమ్మేవాణ్ని పంపించి, తనిప్పుడు యస్సెల్సీ గాడికి ఉద్యోగం ఇవ్వాలి.

రామారావు, ఒక్కొక్క కాండిడేటునే లోపలికి పంపించసాగాడు. అలా పంపించడానికి ముందు, సాధారణంగా ఏయే ప్రశ్నలు అడగవలసిందికూడా చెప్పాడు.

కొంతమంది చెప్పిన జవాబులు వింటుంటే, సత్యవతికి ఏడవాలో నవ్వాలో తెలియలేదు.

"తాజ్ మహాల్‌కు అంతకీర్తి ఎందుకొచ్చింది ?" అని సత్యవతి అడిగింది.

"ఆ బీడీలు చాలా ఘాటుగానూ, కమ్మగానూ, ఉంటాయి సార్ ! ఎక్కువమంది వాడటంల్ల దానికా కీర్తి వచ్చింది" అన్నాడొకడు.

ఇంకో అతను, నెహ్రూ అంటే, ఢిల్లీ పంచాయితీ సమితిలో ప్రసిడెంటుగా ఉంటున్నాయన అన్నాడు. ఐన్‌స్టీన్ అంటే, స్టెయిన్ లెస్ స్టీల్ లో ఒకరకం అన్నాడతనే !

కృష్ణమూర్తిని ఆట్టే ప్రశ్నలేమీ అడుగలేదు. అతనున్న కాస్సేపూ చాలా నిర్లక్ష్యంగా ప్రవర్తించాడు.

పోతూ పోతూ "వారం రోజుల తరువాతగానీ, జాయిన్ కాలేను." అని చెప్పి మరీ పోయాడు.

ఎనిమిదో అభ్యర్థిని చూడగానే సత్యవతి మనస్సు చలించిపోయింది. అతను సన్నగా పొట్టిగా వున్నాడు. భుజాల మీద చిరిగిన చొక్కా వేసుకొన్నాడు. పంట్లాం అతనిది కాదని తెలుస్తూనేవుంది. రాగానే నమస్కరించి నిలబడ్డాడు.

"ఇంతకుముందు మీరేం చేస్తుండేవారు?" అన్నది సత్యవతి.

"ప్రెస్‌లో ప్రూఫురీడర్‌గా పనిచేస్తున్నానండీ!" అన్నాడతను.

"ఎంత జీతమిస్తారు?"

"అరవై రెండు."

"ఈ వుద్యోగం మీకే ఎందుకివ్వాలో చెబుతారా?" అన్నది సత్యవతి.

అతను ఓ నిమిషంపాటు తలొంచుకొని నిలబడ్డాడు.

"చెప్పండి! ఇంకా కాండిడేట్సు వున్నారు."

అతను ఏడుపును దిగమింగుకొనిగానీ చెప్పలేక పోయాడు.

"అయిదుగురు బిడ్డలతండ్రినండీ! పిల్లలకు చదువులు కూడా చెప్పించుకోలేకుండా వున్నాను. పెద్దవాణ్ణీ, రెండోవాణ్ణీ, ప్రెస్సుపనిలోనేపడేశాను. మిగిలినవాళ్ళకయినా ఇంత అక్షరంముక్క చెప్పించుదామంటే నాకు శక్తిలేదు సార్! మీకు కావలసిన క్వాలిఫికేషన్సన్నీ నాకున్నాయి. మీరువ్వదలిస్తే నామీద దయతల్చి ఇవ్వాల్సిందే నండీ: ఇప్పటికి

నాలుగైదు ఆఫీసుల్లో ఇంటర్వ్యూలకని పిలిచారు. గట్టి రికమెండేషనులున్న వారికి తప్ప వుద్యోగాలు రావడం లేదండీ! నాకు భగవంతుడు తప్ప రికమెండ్ చేసేవారెవ్వరూ లేరు. ఆ తరవాత మీదయ !" అన్నాడతను.

సత్యవతి కరిగిపోయింది. ఆవిడ కళ్ళుకూడా నీటితో నిండిపోయాయి.

"ఉద్యోగమిస్తే మీరెప్పటిలోగా చేరగలుగుతారండీ!"

"కనీసం పదిహేను రోజుల వ్యవధన్నా కావాలిసార్. నేను మానుకుంటున్నానని ప్రెస్ వారికి నోటీసివ్వాలి" అన్నాడతను.

" సడెన్‌గా మానేస్తేనేం !" అన్నది సత్యవతి. అతన్నో వూపు వూపి చూద్దామని.

"వాళ్ళు మరో మనిషిని చూచుకోవాలి గదండీ !"

"మంచిది మీరు వెళ్ళండి !"

అతను మరోసారి దణ్ణంపెట్టి వెళ్ళిపోయాడు. వెళ్ళేటప్పుడు అతన్నోసారి తేరిపార చూసింది సత్యవతి. ఎంత ఉత్సాహంగా వెళ్ళాడతను !

మిగిలినవారిని, ఆవిడే మడిగిందో, వారేం చెప్పారో తెలీదు. ఉద్యోగం, ప్రూఫురీడర్ కివ్వమంటూ సిఫార్సుచేసి, సంతకం పెట్టింది. ఆవిడ ప్రాణాని కిప్పుడు ఠవంత హాయిగా ఉంది. ఉదయంనుండీ తనుచేసిన పనిలో, కాస్సంత మంచి పని ఇదే ననుకొన్నది సత్యవతి.

ఇంతలోకే బంట్రోతు ఫైల్సు తీసుకొచ్చి డేశాడు జమాను. వాటన్నిటమీదా 'అర్జెంటు' – 'స్పెషల్'

'కాన్ఫిడెన్షియల్' 'మోస్టుఅర్జెంట్' — 'ఇమ్మీడియట్' అని రాసివుంది. ఇన్ని ఫైళ్లూ తనిప్పుడు చదివి, తన అభిప్రాయాలు రాయడం జరగాలి. వీటిని చదవడానికే వారం రోజులు పడుతుందే, సాయంత్రానికి ఎలా పూర్తిచేయడం?

ఈ లోగానే పి. ఎ. గారు ఫోను చేసి థాంక్స్ చెప్పాడు. కృష్ణమూర్తి ఈపూటే వూరికెడుతున్నాడనీ, వారంరోజుల్లోగా వస్తాడనీ, కాబట్టి, అతని కా వ్యవధి ఉండేలాగా జాయిన్ కమ్మని, ఎప్పాయింట్‌మెంటు ఆర్డర్ ఇస్యూ చెయ్యవలసిందిగా కోరాడు. ఫైల్‌ను వెంటనే పంపిస్తే, అయ్యగారు, వెళ్ళకముందే తను సంతకం చేయిస్తాననికూడా అన్నాడు. సత్యవతి ఏదో అనబోయిందిగానీ, ఆసరికే అతను ఫోను పెట్టేశాడు.

సత్యవతికి వొళ్ళు మండిపోయింది. వెంటనే పి. ఏ. కు ఫోనుచేసి, ఆ ఉద్యోగం కృష్ణమూర్తికివ్వడంలేదని చెబుదామనుకొంది. అతని నెంబర్‌కోసం టెలిఫోన్‌గైడ్ వెదుకుతుంటగా రామారావు వచ్చాడు. సత్యవతి రాసిన 'నోట్' చదివి నిర్విణ్ణుడయిపోయాడు

"అతనికి ఎప్పాయింట్‌మెంట్ ఖాయంచేస్తూ, పదిహేను రోజుల్లోగా వచ్చి చేరమని జాబుతెలుపు చేయించి పట్టుకురండి. సంతకం పెట్టేస్తాను." అన్నది సత్యవతి. దాదాపు అయిదారు నిముషాలపాటు అతనేమీ అనలేకపోయాడు.

"ఏమిటండీ అలా చూస్తున్నారు ?"

"పైనించి మాటొస్తుంది సార్ ! మ్యాకుమాత్రం

తెలియం దేముంది? అందులోనూ నిన్న మీరు తప్పకుండా యిస్తామని ప్రామిస్‌కూడా చేశారు సార్!" అన్నాడు రామారావు.

"చేశానేమో తెలీదు. అయితేమాత్రం, యివ్వాళ్ళ అంతకన్నా మంచివాడు దొరికితే, వాడికి వుద్యోగమివ్వడం తప్పా" అన్నది సత్యవతి.

"ఇవ్వాళమీరు చాలా కొత్తగా మాట్లాడుతున్నారు సార్! ఎప్పాయింట్‌మెంట్‌ఆర్డర్ మనం సరాసరి ఇవ్వడానికి లేదుగదండీ! పైసెక్షన్‌కూడా దీన్ని ఒప్పుకోవాలి. మనమీ ఫైల్‌ను పంపుతే, వాళ్ళు వొప్పుకోరండీ!"

"ఏం చేస్తారుట?" అన్నది సత్యవతి.

"మీరు తమాషాకు అడుగుతున్నారుగానీ, తెలీకనా సార్! రీకన్సిడర్ చెయ్యమని మళ్ళాపంపుతారండీ! అప్పటికీ మీారు సరైన కాండిడేట్ పేరు — కృష్ణమూర్తి పేరు- రాయకపోతే, ఈ ఇంటర్వ్యూని కాన్సిల్ చేసి, మళ్ళా పిలవమంటారండి! ఒకసారి స్వామినాథన్ యిలాగే చేసినందుకు అతణ్ణి క్షణాలమీద మరో సెక్షన్‌కు మార్చేసిన సంగతి మీకు తెలిసిందేగదండి" అన్నాడు రామారావు.

సత్యవతి తల దిమ్మెక్కిపోయింది. కోపంతో ముఖమంతా జేవురించింది. కళ్ళురెండూ గట్టిగా నులుముకొని, తలఅడ్డంగా ఆడిస్తూ "ఏదయితే అదేఅవుతుంది. ఇట్లాగే ఫైల్‌పైకి పంపించు తరవాత సంగతి చూదాం!" అన్నది సత్యవతి.

రామారావు నిట్టూర్చాడు.

"మీ ఇష్టంసార్ ! ఇప్పుడు పైపిష్టుకూడాలేదు. రేపు పంపుతాను" అన్నాడు రామారావు రేపటికి శంకరం మామూలువాడవుతా డన్న నమ్మకంతో.

"మంచిది... కాశీపతి వున్నాడా ?"

రామారావు పలకలేదు.

"సీట్లో లేడా ?"

"లేదుసార్ లంచ్‌కెళ్ళాడు."

మూడు గంటలకు లంచ్ యేమిటయ్యా ? దానికో వేళంటూ అఘోరించినప్పుడు, అప్పుడు యేడవాలిగానీ, ఎప్పుడుబడితే అప్పుడల్లా చెక్కేయ్యడమేనా ? ఇది ఆఫీసా ? బందెలదొడ్డా ?" అన్నది సత్యవతి.

"శ్రీమద్రామానుజాయనమః బిడ్డా. ఆ అగ్గిపెట్టిలా విసరవోయ్ !" అని పెద్దగా కేకలుపెట్టాడు సీతారామాచార్యులుగారు.

"చిత్తం బాబాయ్ ! పెట్టెలంటే నీకుచాలా మోజను కుంటాను బాబాయ్!" అన్నాడు ముకుందంకూడా పెద్దగానే.

"ఎందుకు రామారావ్ వాళ్ళంత అసభ్యంగా మాట్లాడతారు ? అవతల సుమతికూడా వున్నదిగదా ! ఆవిడేమవ్వా అనుకోదూ ?"

ఈసారికూడా రామారావేమీ పలకలేదు.

"వీళ్ళు మనుషులుకాదు పశువులు. నువ్వోళ్ళు... అన్నట్టు – వీటినేం చెయ్యమంటావ్ ?" అన్నది ఫైల్ కేసి చూస్తూ.

"సంతకాలు పెట్టెయ్యండి సార్ ! నేనన్నీ రాశాను.

సరిచూసినట్టు కాశీపతిగారుకూడా ఇనిషియల్స్ వేశారు. ఇవ్వాళ నాలుగులోగా వీటిని మనం పంపించాలి" అన్నాడు రామారావు.

అతను వెళ్ళాక సత్యవతి ఒక్కో—ఫైలునే చూడసాగింది. ఏమున్నా— అర్థమయిందనుకోవడానికి లేదు. నాలుగులైన్ల విషయానికి నూటనలభై నాలుగు రిఫరెన్సు నెంబర్లున్నాయి. ఇవేవీ చూస్తే బోధపడవు.

అయిదుగంటలు దాటినా సంతకాలు చేయడం కానే లేదు. ఈలోగా అరడజనుమందిమనుషులొచ్చి, దణ్ణాలు పెట్టి నానా చెత్తాఖానీ ప్రశ్నలన్నీ వేసి దుంపతెంచేశారు. వాళ్ళకు చాలా జాగ్రత్తగా సమాధానాలు చెప్పి పంపించిందావిడ. ఈ సందులోనే పాతికసార్లు టెలిఫోన్ పిలుపులు. ఎవడో సయ్యద్ బేగంట, జాన్ సుబ్బయ్యగాడట, అమ్మన్న స్వామిట, మాలపీయాగాడట, వల్లకాట్లో రామరుద్రాయట వీరందరూ శతకోటి విషయాలను గురించి అడిగారు. చాలామందికి తనకు వొంట్లో బాగాలేదనీ, రేపు చూదామనీ, చెప్పి తప్పుకొందావిడ. ఆ ఓరాకులో వుండగానే రఘునాథరావు వస్తానన్నాడు. అతనిధోరణి చూస్తుంటే, శంకరానికీ, అతనికీ మాంఛిపరిచయం వున్నట్లనిపించింది.

"ఈపూట నా మనస్సు బావోలేదండీ ! దయచేసి రేపు నన్ను ఆఫీసులో కలుసుకోగలరా ?" అని మామూలు వాక్యాలనే వాడింది సత్యవతి.

"ఆసంగతి నాకు తెలుసులేరా గణపాయ్ ! ఎదురుగా

ఎవరన్నా వున్నా రేమిటీ 'అండీ'-'దయచేసి' అంటున్నావ్?" అన్నాడతను పెద్దగా నవ్వుతూ.

"ఎవ్వరూ లేరనుకో——" అని ఆపేకించి సత్యవతి, 'అండి' కలపకుండా. "మరో అరగంటలోగా ఫోన్ చేస్తాను. మీ నెంబరు చెప్పండి."

"ఓరి వెధవా! ఎంతవాంట్లో బావో లేకపోతేమాత్రం ఫోన్ నెంబరెలా మరచిపోతావోయ్? చాలా గమ్మత్తుగా వుందే? పోనీ, పనిగానీ ప్రెషర్ గా వుందా?" అన్నాడు రఘునాథరావు ఫోన్లోనే చాలా రహస్యంగా.

'ఛా' నంటే యీపీకా వదల్తుందని "మరే" అన్నది సత్యవతి.

"అలా యేడవరాదు? మరి మీ సుమతి వ్యవహారం యెంతవరకు తెచ్చావ్?"

సత్యవతి ముఖం నాలిపోయింది.

"ఏముంది తీసుకురావడానికి?"

"సరేలే రేపు మాట్లాడదాం. ఆనకక్లబ్బుకొస్తావా?" అన్నది రాఘునాథరావు గొంతు.

"చూస్తాను" అని ఫోను పెట్టేసింది సత్యవతి.

ఈసారికూడా సుమతివిషయం తేలిందేమీ లేదు. ఆవిడ వోసారి నిట్టూర్చి గబగబా స్నానకాలు చేసేసింది. బెల్ నొక్కగానే జవాను వచ్చాడు. ఇవన్నీ కాశీపతిగారి కివ్వమనీ, రామారావును పంపించమనీ చెప్పింది.

"ఆ రంగనాథ యెళ్లిపోయారండి! రామారావుగారు

ఏందో రాసుకొంటూ ఉండరు సుమతమ్మగారు మాత్రం ఉంటారుండీ !"

"పిలువ్" ! అన్నది సత్యవతి.

సుమతివిషయం ఆఖరుకు జమాన్లకూ కూడా తెలిసి పోయిందనుకొన్నది.

జమాను ఫైళ్ళు తీసుకొని వెళ్ళాడు. మరికాస్సేపటి కల్లా సుమతి నీరసంగా వచ్చింది.

"కూచోండి !" అన్నది సత్యవతి.

సుమతి నిలబడింది.

"మీతో మాట్లాడాలి." అన్నది సత్యవతి.

సుమతి ముళ్ళమీద కూర్చున్నట్టు కూచున్నది. కాస్సేపు తలొంచుకున్నాక, మెల్లగా గొణగడం సాగించింది.

"నువ్వేమంటున్నదీ నాకు వినిపించడంలేదు సుమతీ!" అన్నది సత్యవతి చాలా లాలనగా.

"ఎన్నిసార్లు మీకు చెప్పినా వినిపించుకోకుండా ఉన్నారు. ఆఫీసు టైమయ్యాక, నాతో మీరు మాట్లాడవలసిన పనులేముంటాయండి ? ఇందువల్ల నేనెంత ఇరుకులో పడుతున్నానో మీరు ఆలోచించడంలేదు" అన్నది సుమతి.

సత్యవతి కేమీ పాలుపోలేదు.

"మీరు నాకేదన్నా సహాయం చెయ్యదలుచుకొంటే, నాతో మాట్లాడకుండానే చెయ్యవచ్చు ననుకొంటాను. మీరు నన్నుగురించి మంచిగా మాట్లాడినకొద్దీ నాకపకారం చేసినవా రవుతున్నారు. మీకూ నాకూ ఏవో వున్నాయం టున్నారు. ఎందుకీ బెడదలన్నీ చెప్పండి ?"

"సంబంధాలుండగా లేనిది, ఉన్నాయంటే, తప్పే ముంది సుమతీ!" అన్నది సత్యవతి, వోరగా ఆవిడకేసి చూస్తూ.

కొరడాతో బాదినట్లుగా సుమతి ఉలిక్కిపడి చూసింది. సత్యవతి మెల్లగా లేచింది. సుమతిదగ్గరగా వచ్చి, భుజం మీద చెయ్యివేసింది. పురుగును విదిలించినట్లు విదిలించేసింది సుమతి.

"అంత కోపం దేనికి సుమీ?" అన్నది సత్యవతి. మళ్ళా భుజంమీద చెయ్యివేస్తూ.

సుమతి మిన్నాగులా లేచి నిలబడింది. ఆవిడ కళ్ళు నీటితో నిండిపోయాయి.

"మీరిల్లా చేస్తారని నాకు ఏమాత్రం తెలిసినా, మీతో చనువుగానే ఉండకపోదును" అన్నది ఏడుస్తూ.

సత్యవతి గుండెలో, ఎవరో చెయ్యిపెట్టి కెలికినట్ల యింది. అయినా విషయంపూర్తిగా తెలుసుకోనిది విడవ దలచుకోలేదు. వెళ్ళి వాకిలికి అడ్డుగా నిలబడింది.

నువ్వంటే నాకెంతో ఇష్టం సుమతీ. నీఅందం నన్ను పిచ్చి 'దాన్ని' చేసింది. నవ్వినప్పుడు, నీ బుగ్గలు కొద్దిగా గుంటలు పడతాయి చూడు — ఆఁహా — బిగరగా అరవకు. నిన్ను నేను ప్రేమిస్తూన్నాను. ఒక్కసారి నువ్వు — సరేనా? నీకు ప్రమోషనిప్పిస్తాను. ఎంత డబ్బు కావాలంటే అంతా ఇస్తాను. ఏదన్నా హోటలుకు పోదాం. టాక్సీలో నిన్ను మళ్ళా యింటిదగ్గర దింపేస్తా... నామాట వింటావుగదూ?" అంటూ గడ్డంపుచ్చుకున్నది సత్యవతి.

ఆవిడీ మాటలన్నీ అన్నందుకు ఆశ్చర్య మేమీ లేదు. ఎందుకంటే పెళ్ళికిముందు శంకరం ఓసారి దాదాపుగా యిలానే అన్నాడు. అప్పుడేమో తను సంతోషించింది. ఇప్పుడు సుమతి యేడుస్తోంది.

" మీరు పెద్ద వుద్యోగులనుకొంటున్నారేమో ! మరోసారి యిలా అంటే—మర్యాద దక్కదు. రేపట్నించే నేను పని మానుకొంటున్నాను. మీకు పిచ్చెత్తింది. నన్ను వెళ్ళనియ్యండి !" అన్నది సుమతి బిగ్గరగా.

"నిన్ను డిస్మిస్ చేస్తాను !" అన్నది సత్యవతి.

"అక్కర్లేదు. నేనే రిజైన్ చేస్తున్నాను. నీలాంటి లుచ్చాలకింద పని చెయ్యడంకన్నా అడుక్కుతింటం మేలు !"

సత్యవతి హృదయం ఆనందంతో నిండిపోయింది. సుమతి యెంత మంచిదో ఆవిడ కిప్పుడు ప్రత్యక్షంగా రుజువయింది. శంకరానికీ, యీవిడకూ యేదన్నా వుంటే సుమతి ప్రవర్తన మరోలాగా వుండేది. సంబంధముంటే యిలా యెందుకు యేడుస్తుంది ? ఇంత మంచిదాన్ని యేడిపించినందుకు సత్యవతి మనస్ఫూర్తిగా విచారించింది. తన సంసారంలో రేగిన రవరవలు యీనాటితో సరి ! ఇందుకుగాను సుమతికి తను థాంక్స్ చెప్పుకోవాలి.

తను మగాడుగా వున్నానన్న సంగతిని సత్యవతి పూర్తిగా మరచిపోయింది. రెండు చేతులూ చాపి సుమతిని గట్టిగా కౌగిలించుకొని ముద్దుపెట్టుకొంది. సుమతి గనుగులాడింది, గిలగిలా కొట్టుకొంది. సత్యవతి గొంతు నులిమి, చెంప ఛెళ్ళుమని మోగించి, కాంద్రించి ఉమ్మి, తలుపులు

దఢామని తోసుకొని గాలిలో యీదుతున్న దానిలాగా వెళ్లిపోయింది. సత్యవతి నోటంట యేమాట రాలేదు. ఆవిడ కొయ్యబారిపోయి అలానే నిలుచుండిపోయింది.

ఆఖరికి ఆఫీసులో సందడి తగ్గిపోయింది. రామారావు కూడా లేడు. ఆ కొసనుండి చౌకీదారు తలుపులు వేసుకొంటూ వస్తున్నాడు. ఇక్కడో మనిషి, అక్కడో మనిషి, అక్కడో బంట్రోతు కాగితాలు పట్టుకొని హడావుడిగా తిరుగుతున్నారు. క్రిందినుండి కారు హారన్ మోగి మోగి ఆగిపోయింది. ఆ తరువాత పది నిమిషాలకల్లా యెవరో వరండాలో ఆ కొసన నిలబడి చెయ్యి వూపారు. సత్యవతి ఆ సైగను గమనించలేదు.

"రావోయ్! అలా నిలుచున్నావేం?"

సత్యవతి తనను కాదనుకొంది.

"ఏమిట్రా బాబూ యీ నటన!" అంటూనే అతను దగ్గరగా వచ్చాడు.

అప్పటికి కనుచీకటిపడుతూవుంది. ఫర్లాంగు పొడవున్న వరండాలో అతనూ, సత్యవతి తప్ప, మరెవ్వరూ లేరు. అతను రూళ్లకర్రంత చుట్ట కాలుస్తున్నాడు. బస్తాలాంటి శరీరం సూట్‌లో యిమడలేక బయటికి తోసుకొస్తూవుంది. తలకూ, భుజాలకూ మధ్య ఖాళీ లేనేలేదు.

సత్యవతి గుండెలు గుబగుబలాడాయి. కాళ్ళలో నుండి చలి ప్రారంభమయింది. భయం భయంగా అటూ, యిటూ చూసింది. అతను పగలబడి నవ్వుతున్నాడు.

"ఏమిట్రా అలా చూస్తావ్? సుమతిని యేమన్నా

అన్నావేమిటి? అలా బెదురు గొడ్డులా పరుగెత్తుతో చేమిటి?" అన్నాడతను.

"తెలీదు" అన్నది సత్యవతి.

"ఇవ్వాళ నీ వొంట్లో బాగోలేదటగా" అన్నాడతను.

"ఊఁ" అన్నది సత్యవతి.

అతను పొట్టను తాకి చూశాడు. నుదురు పట్టుకొన్నాడు. చేతిని వత్తిచూశాడు. సత్యవతి ప్రాణం గిలగిలలాడిపోయింది. దూరం జరిగినకొద్దికీ అతనూ ముందుకు తోసుకొస్తున్నాడు.

"వేడిగా కూడా లేదుకదరా! ఆఫీసునంతా గందరగోళంచేసి పారేశావుటగా! ఆ కాశీపతిగాడు వొకటే గోల! ఇన్నేళ్ళనించీ లేంది కొత్తగా సంతకాలు చెయ్యమన్నావుట, టైం నోట్ చెయ్యమన్నావుట, వెంకటరత్నిగాడిమీద రిపోర్టు రాశావుట—యేమిట్రా యిదంతా?"

అతను రెక్కపట్టుకొని యీడ్చుకుపోతున్నంత పని చేస్తున్నాడు. సత్యవతి గింజుకొని కూడా విడిపించుకోలేకపోయింది.

"నిజమేనా?"

"ఊఁ" అన్నది సత్యవతి.

"అంటే వారన్నమాటలన్నీ నిజమే నన్నమాట! నీకు మెంటల్ బ్యాలెన్సు తప్పిపోయిందన్నాడు కాశీపతిగాడు."

ఇద్దరూ కారుదగ్గర కొచ్చారు.

"నే నింటికి వెడతాను" అన్నది సత్యవతి.

"ఈ తిక్క బుర్రతో కొంప కెళ్ళి సత్యవతిని హింస

పెట్టడానికిట్రా ! అలా ఛస్తే వొప్పుకోను. ముందు క్లబ్బుకు పోదాంపద. కావలిస్తే యింటిదగ్గర దిగబెడతాను."

"నేను రాను. నన్ను వెళ్ళనివ్వు."

"ఏడిశావులే పదరా గణపాయ్! ఈ పూట ఓకుకు పావలాలు పెడుతున్నాం! ఆ చలపతిగాడు, యీ దెబ్బతో గుండె ఆగి చావాలి."

పోవడానిక్కూడా వీల్లేకుండా అతను కార్లోకి తోసి తలుపులు వేసేశాడు. కారు బయలుదేరింది. సత్యవతి ప్రాణాలు లేచిపోయాయి. అతగాడేం చేసినా తాను నిస్సహాయంగా వుండిపోవలసిందేతప్ప యేమి చెయ్యలేదు. అరచి మాత్రం లాభమేముంది ?

అతను వొంటిచేత్తో స్టీరింగు తిప్పుతూ మరో చెయ్యి సత్యవతి భుజంమీద వేశాడు. దోవపొడుగునా యేవోకబుర్లు చెబుతూ నేవున్నాడు. మధ్య మధ్య గుండెలమీద కొట్టాడు. ఒకసారి తొడమీద చెయ్యి వేశాడు. సత్యవతి చేపపిల్లలా గిజ గిజలాడిపోయింది. ఊపిరి బిగపట్టుకొని శరీరమంతా ముడుచుకొని వొదిగి వొదిగి కూచున్నది.

"ఆడముండలా అలా ముడుచుకుపోతావేమిట్రా?" అన్నాడతను నవ్వి.

గతిలేక సత్యవతి కూడా నవ్వింది.

కారు ఓ పెద్దమేడముందాగింది. ఇద్దరూ దిగారు. వరండాలో వరసగా గుండ్రని బల్లలు వేసివున్నాయి. వాటి చుట్టూ మనుషు లున్నారు. అందరి బల్లలమీదా పేక

లున్నాయి. బల్లలకింద సోడాబుడ్లు, కప్పులు, గ్లాసులు, సిగ రెట్‌పీకలూ వున్నాయి.

"అడుగో మధుసూదనంవచ్చాడు, శంకరంగారుకూడ వచ్చాడోయ్ !" అన్నారెవరో.

"బ్రతికేం. యీ బోండాంగాడు మధుసూదనం" అను కొన్నది సత్యవతి.

ఇద్దరూ హాల్లోగుండా మేడమీదికొచ్చారు. దోవ పొడుగునా చాలామంది సత్యవతిని చూసి నమస్కారాలు చేశారు. ఆ ముఖాన్ని చూసి సత్యవతి బిత్తరపోయింది. తను శంకరంగా మారి వుండకపోతే, ఇందులోకి అడుగుపెట్ట డమే జరిగి వుండదనుకొన్న దావిడ. మెట్లెక్కుతుండగా, ఓ లాల్చీవాలా కనపడి దణ్ణంపెట్టాడు. సత్యవతి ఓ క్షణం ఆగిపోయింది.

"రేపు మధ్యాహ్నం కలుసుకొంటా" నన్నాడతను.

"దేనికి ?" అన్నది సత్యవతి.

అతనో క్షణం ఖంగుతిని, అంతలోనే తెప్పరిల్లి, తల ఊగించి "చిత్తం వెళ్ళిరండి" అన్నాడు నవ్వుతూ.

ఆసరికే మధుసూదనం చివరి మెట్టుదాకా వెళ్ళి పోయాడు. సత్యవతికూడా అతన్ని కలుసుకొంది. మరో రెండు పెద్దగదులు దాటాక, ఓ చిన్నగదిలోకి వచ్చారు. అప్పటికే నలుగురున్నారక్కడ, వీరికోసమే ఎదురు చూస్తు న్నట్లుగా. వీళ్ళు కనపడగానే, ఓసారి గడియారాలు చూసు కున్నారు. నౌకరు కుర్రాడొచ్చి, అనవసరంగా బల్లదులిపి, పేకదస్తా పడేసి వాకిట్లోకి వెళ్ళిపోయాడు.

మధుసూదనం పేక కలిపాడు. అందరికీ ముక్కలు పంచాడు. 'ట్రయల్' అన్నాడు మరోడు, సిగరెట్‌ను ఒక్కసారే సగందాకా పీల్చేసి.

"అల్లా వున్నావేమిటోయ్!" అన్నాడింకో గిరజాల జుట్టువాడు.

"శంకరానికి వొంట్లో బావుండలేదుట' అన్నాడు మధుసూదనం

"ఎందుకనిట?" అన్నాడు ఓ పొట్టివాడు.

అక్కణ్ణించి సంభాషణ ఆడవాళ్ళమీదికి మళ్ళింది. ఆ కబుర్లు వినలేక సత్యవతి చెవులు మూసుకొంది.

"మన చక్రవర్తిగాడు, తాహెరాబేగం కోసం కలవరిస్తాడుగానీ, నేను చూశాన్రా! పరమ ఓల్డ్ సరుకురా నాన్నా! నైన్‌టీన్ ట్వెంటీసిక్సు మోడల్" అన్నాడొకడు.

"రంగుచూసి భ్రమిశాళ్ళేవోయ్!" అన్నాడు మధుసూదనం నవ్వి.

"మీటర్ యేమాత్రం తిరిగివుంటుందిరా గురూజీ?" అన్నాడు పొట్టివాడు.

అందరూ చచ్చేట్టు నవ్వేశారు.

"ప్రేమియర్స్ని వొచ్చాక వయస్సు తెలుసుకోవడమే బ్రహ్మభేదంగా వుందోయ్! వాటి తల్లికడుపుకాల, అన్నీ వొకే సైజువి గదుటోయ్!"

సత్యవతి చెవులు మూసుకొంది. నడివీధిలో దిగంబరిగా నిలబడినట్లు ఫీలయింది. ఇక్కణ్ణించి త్వరగా బయటపడకపోతే చావు ఖాయమనుకొంది.

పొట్టివాడు పేకలు పంచాడు. సత్యవతికి వాటిని పట్టుకోవడంకూడా చాతకాలేదు. ఆ బొమ్మలకేసీ, అంకెలకేసీ, నిర్జీవంగా చూసిందావిడ.

"ఆడవేశా?" అన్నాడు మధుసూదనం, సత్యవతి డొక్కలో సన్నగా పొడిచి.

"ఇప్పుడేం చెయ్యమంటారు?" అన్నది సత్యవతి అయోమయంగా.

"ముక్క పడయ్యవేం? ఏమిట్రా నీ పరధ్యానం? దొంగవేషా లేశావంటే తాటచీరేస్తాను, ముందు పడెయ్!" అన్నాడు మధుసూదనం నవ్వుతూ.

సత్యవతి ముక్కలన్నీ పడేసింది. ఆట సర్వనాశనమయిపోయింది.

"పోనీ కాస్సేపు నువ్వలా కుర్చీలో కూచోరా! రెస్టుతీసుకో. ఈలోగా మేంనాలుగురౌండ్లు కొట్టుకొంటాం!" అన్నాడు పొట్టివాడు.

"రక్షించారు" అంటూ సత్యవతి, పక్కనేవున్న సోఫాలో కూలబడింది. మధుసూదనం కుర్రాణ్ని పిలిచి, శంకరంగారికి యేం కావాలో చూడమన్నాడు.

"నాకేంవద్దు" అన్నది సత్యవతి.

"మందుపుచ్చుకోవోయ్! అరగంటకల్లా సర్దుకొంటుంది!" అన్నాడు తాహేరాబేగం ముచ్చట చెప్పినవాడు.

"త్రీడాగర్స్ తీసుకరానాసార్?" అన్నాడు కుర్రాడు సత్యవతికేసి చూస్తూ.

"వద్దు"

"తీసుకురావోయ్! వాడు గాకపోతే మేం పుచ్చుకొంటాం. డబ్బు మధుగాణ్ణడిగి తీసుకో. పడేయ్‌రా పాతికా!"

కుర్రాడు వెళ్ళిపోయాడు.

పేకాట సాగుతూనేవుంది. మధ్య మధ్య యిల్లెగిరిపోయేట్టు అరుస్తున్నారు.

"మణేల ముందు దిగి నా ఆటంతా నాశనం చేసుకొన్నానోయ్!" అన్నాడొకడు.

"ఆసుమీద పట్టొస్తుందనుకొన్నాను. తురుపుపడేసి బద్దలుగా కోసి పారేస్తివి, ఒరేయ్! నీది రాతిగుండెరా!" అన్నాడు మరొకడు.

"అన్నీ పొళ్ళే పడేశావు. ఈసారన్నా మంచి ముక్క రాల్చవోయ్!" అన్నాడు పొట్టివాడు.

ఈభాష సత్యవతికి బొత్తిగా అర్థంకాలేదు. ఆసుకు పట్టెందుకు రావాలో. తురుపుపోడికి, ఆసు, యెందుకని బద్దలుగా పగలాలో, పోడులనేవి అసలెందుకు పనికిరావో, ఆవిడకు బోధపడలేదు అర్థమయిందల్లా, ఆటకూ ఆటకూ మధ్యగల సమయంలో, ఆడవాళ్ళను గురించి అనుకొన్న మాటలు. వసుంధర, నోరుపాచివాసన వేస్తుందనీ, మనోరమ పేరు చెప్పగానే వాషర్లు జ్ఞాపకం వస్తాయని, ఆజీపాషా పిరుదులు గుండ్రంగా వుంటాయనీ, సిగ్గులేకుండా చెప్పుకొంటున్నారు.

"ఓహోహోహో! షమీన్ తొడలుంటాయి బ్రదర్! అవి తొడలట్రా నాన్నా! మహాకవులు రాస్తారు చూశావ్,

బంగారపు స్తంభాలని! అలా వుంటాయిరా! ఇవరీ ఫినిషింగ్! ఇవ్వాళ గెలిచానో! రేపు ఆబ్సెంట్! గండిపేట ఛలో _ ఛలో!" అన్నాడు గిరిజాల జుట్టువాడు చిటికెలు వేస్తూ.

పొట్టివాడు పాట లంకించుకొన్నాడు.
"అబ్బ దాని సోకో!
డబల్ పన్న జాకీటు"
"రాత్రి పన్నెండు గంటలకు
రౌండు తిరిగి నే నొస్తే
రానూ పొమ్మంటివే
రమణి ముద్దులగుమ్మా
నా రమణి ముద్దులగుమ్మా!
తక్కధికా తక్కధికా
త్రైత్రై తమికధికా!"

నుదులు వూపుతూ, తొడమీద దరువుదంచుతూ— వాడు పాడుతుంటే మిగిలినవారు పాటలయకు అనుగుణంగా బల్లమీద చేత్తో చరవసాగారు. ముక్కలు పంచడం కాగానే అందరూ మళ్ళా ఆటలో మునిగిపోయేవారు.

కుర్రవాడు పొడవైన సీసా ఒకటి, అరడజను సోడాలూ పట్టుకొచ్చాడు

"ముందుగా శంకరంగారి కివ్వావోయ్!" అన్నాడు గిరజాలవాడు.

కుర్రవాడు సీసామూత తీసి, యింత 'మందు' పోసి, సోడ నీళ్ళతో గ్లాసు నింపేసి సత్యవతి ముందు పెట్టాడు. ఆ

వాసన సత్యవతి భరించలేకపోయింది. ముక్కు మూసుకొని గ్లాసును పక్కగా పెట్టింది.

"పుచ్చుకోరా కన్నడూ! నీ సుస్త్రీగిస్త్రీ యీ దెబ్బతో 'తాం' " అన్నాడు పొట్టివాటు.

"వొద్దొద్దు. నా కలవాటు లేదు" అన్నది సత్యవతి చేతులు అడ్డంగా తిప్పుతూ.

"అలవాటు లేదని యెంతకాలమని వూరుకొంటావోయ్! పుట్టినప్పుడు నీకు నడవడం మాత్రం వచ్చునా? మెల్లగా నేర్చుకొన్నావా లేదా' ఇదీ అంతే! ఈ రోజునే ప్రారంభోత్సవం చెయ్యి" అన్నాడు గిరజాలవాడు.

"నావల్ల కాదు. నే తాగను" అన్నది సత్యవతి లేచి నిలబడి.

మధుసూదనం పేక కిందపడేసి వచ్చాడు.

"బ్రదర్! వొంట్లో బావోలేదంటున్నావు! ఈ గ్లాసు పుచ్చుకో. అన్నీ సర్దుకొంటాయి. ప్లీజ్!" అన్నాడు గ్లాసును సత్యవతి పెదవులదగ్గర వుంచి.

"ఊఁహు! నా కొద్దు!"

"అయినా విడిచేది లేదు నిన్నుమాత్రం రోజూ బలవంతం చేస్తున్నాననుకో. పిచ్చినాన్నా! వొంట్లో సరిలేదంటున్నావు గనుక పుచ్చుకోమంటున్నాను. అమృతంలా పని చేస్తుందిరా గురూ! అమృతం!"

నలుగురూ లేచి సత్యవతిని పట్టుకొన్నారు. మధుసూదనంబలవంతాన గ్లాసు నోట్లోకి వంచేశాడు. గమగమలాడుతున్న బంగారురంగు ద్రవం నోట నిండిపోయింది.

క్షణకాలం నోరంతా భగ్గుమని మండింది. చిరుచేదుతో, నాలుక మడత పడిపోయింది. ముక్కుల్లోనుండి వాసన వెలువడింది. సత్యవతి గుటక వేసింది. ద్రవం లోపలి కెళ్ళినంత మేరా కాలుతున్నట్లనిపించింది.

"ఇహ కూచో! వోపికుంటే ఆడు" అన్నాడు మధుసూదనం. జీడిపప్పు తినరా! ఖంగారుపడకు. ఇక నీ సుస్తి గిస్తి జాంతానై, కత్తిలా తిరుగుతావు చూసుకోమరి!"

సత్యవతి కణతలమీద సుత్తితో కొడుతున్నట్లనిపించింది. పేగులన్నీ మెలుచుకుపోతున్నాయి. నరాలను ఎవరో పట్టి లాగుతున్నారు. తలబరువుగా ఓ పక్కకు వాలుతోంది. శరీరంమీద క్రమక్రమంగా స్వాధీనం తప్పుతోంది. బరువును కోల్పోయిన భావన కలుగుతోంది. తనెవరో అయినట్లూ తనకోసం తనే వెదుక్కుంటూన్నట్టూ అనిపించింది. కాళ్ళు వూగించింది, చేతులు ఆడించింది. ఆ పనులు తను చేస్తున్నానని సత్యవతి అనుకోలేకపోయింది. మరెవరో కదిలిస్తున్నట్లు అనుకొన్నది.

హఠాత్తుగా ఆవిడకు శంకరం జ్ఞాపకం వచ్చాడు. తనకూ అతనికీ మధ్యదూరం మరెంత విశాలంగా తోచింది. కళ్ళలో నీళ్ళుతిరిగాయి. అతన్ని చూడాలని, మనస్సు గోల పెడుతోంది. అంతకన్నా ముఖ్యం, యీ వాతావరణంనుండి చప్పున బయటపడాలనుకొన్నది.

"నేను వెడతాను!" అన్నది సత్యవతి.

ఆవిడ నాలుక, స్వాధీనంలో లేదు. మాటలు బండగా వచ్చాయి.

"అప్పుడేనుట్రా! తొమ్మిదన్నా కాలేదూ" అన్నాడు పొట్టివాడు.

"కాసేపు వుండవోయి! వాసన పసిగట్టిందంటే నీ పెళ్ళాం చెప్పుచ్చుకొంటుంది!" అన్నాడు మధుసూదనం.

"నేనంత నీచురాల్ని కాదు!" అన్నది సత్యవతి అసహ్యంగా వారికేసి చూస్తూ.

ఓక్షణం అందరూ సత్యవతిని పరకాయించి చూసి, తరువాత వొకరి నొకరు చూసుకొని గొల్లుమని నవ్వారు.

"ఓ మంచు బ్రహ్మాండంగా పనిచేసిందిరా! ఇక నీ జటలం వొదిలిందనుకో... పోతానంటే రిక్షామీదపోవాలి మరి! లేవా ఆటయిందాకావుండు" అన్నాడు మధుసూదనం.

"వెడతాను!" అంటూ సత్యవతి లేచింది. ఎవరో కనుపించని తాళ్ళుకట్టి పైకిగుంజుతున్నట్లనిపించింది. అలానే అడుగులు వేసుకొంటూ బయటకొచ్చింది. ముందున్న మెట్లు కదిలిపోయాయి.

సత్యవతి యింటికొచ్చేసరికి పది గంటలు దాటింది. రిక్షావాడికి రూపాయినోటిచ్చి, వాడెంత చిల్లరిచ్చిందికూడా చూసుకోకుండా, యెవరో తరుముకొస్తున్నట్లుగా లోపలి కొచ్చింది. హాల్లో శంకరం కూచునివున్నాడు. అతని జుట్టంతా రేగివుంది. చేతిగాజులు పగిలాయి. చీరె దాదాపుగా వూడిపోయింది. దాన్ని వుండలాగా చుట్టి, వొళ్ళో పెట్టుకొని కూచున్నాడు. జాకెట్టు వీపుమీదా భుజంమీదా చిరిగివుంది. ఆ పీలికలు గాలిలో యెండుటాకుల్లా ఆడుతున్నాయి.

"ఏమిటండీ ఇది!" అన్నది సత్యవతి అంతమైకం లోనూ ఆశ్చర్యపోతూ.

శంకరం నవ్వాడు. చీరెను సర్దుకొన్నాడు.

"నీ ఆకారం మరీ అద్భుతంగావుంది సత్యా! పాంటు గుండీలు యెప్పుడనంగా వూడిపోయాయో! పెట్టకోవడం మరచిపోయావు. దోవపొడవునా యిలాగే వచ్చావుగా!" అన్నాడు శంకరం.

"ఆఁ" అన్నది సత్యవతి, సిగ్గుపడి, అక్కడ చేతులతో కప్పుకొంటూ.

"అలావున్నావేమిటమ్మా! క్లబ్బునించా?" అన్నాడు శంకరం.

సత్యవతి తలాడించింది.

"ఇలాంటిదేదో జరిగివుంటుందని, నేనూ అనుకొన్నాను. పద, ముందా పాంట్సూ, షర్టూ, కోటు, బహుశా ఆఫీసులో నే మరచిపోయావనుకొంటాను... అయినా వుంటుందిలే ముందు స్నానంచెయ్!" అన్నాడు శంకరం.

"నా కోపిక లేదండీ!" అన్నది సత్యవతి నీరసంగా.

"అలా నేనన్నందుకు నువ్వొప్పుకొన్నావు కనకనా, నేనిప్పు డొప్పుకోవడానికి. నీళ్ళు కాచాను. కారియర్ తెప్పించాను. ముందు లేవాలి" అన్నాడు శంకరం.

సత్యవతి స్నానంచేసివచ్చింది. చీరెకోసం బీరువాలో వెదుకుతుంటే, శంకరం వచ్చాడు.

"నువ్వీపూటకూడా లుంగీ కట్టుకోవాలి. నేను చీరె కట్టుకోవాలి. నీకభ్యంతరం లేకపోతే కాస్త చీరె సింగారించి

పెట్టు నాకు. ఇందాకట్నించి ఈ మాట జారిపోకుండా పట్టు కోలేక ఛస్తున్నాను” అన్నాడు శంకరం.

సత్యవతి, శంకరానికి చీరె కట్టింది. వేరే జాకెట్టు తొడిగింది. ఇలా యెందుకయిందని సత్యవతి చాలాసార్లు అడిగింది. భోజనాలయ్యాకగానీ, అతను ఆ విషయం యెత్తుకోలేదు. తను సూరమ్మతో మాట్లాడిన ధోరణీ, అది చెప్పిన సమాధానమూ, పొల్లుపోకుండా చెప్పాడు శంకరం.

సత్యవతి ఆసక్తిగా వినసాగింది.

“ఆరు గంటలయి వుంటుంది. ప్రభాకరం, యేదో పనున్నవాడిలాగా వచ్చాడు. సూరమ్మను పొగిడాడు. వీడి సంగతేదో అంతు తేల్చుకొందామని, నేనూ నటించాను. మెల్లిగా లోపలికి పిలిచాను. వాడూ వచ్చాడు పాపం! గదిలోకి వస్తూనే తలుపులు దగ్గరగా వేశాడు. వెనగ్గావొచ్చి నా భుజాలమీద చేతులు వేశాడు...” అని పకపకా నవ్వసాగాడు శంకరం.

సత్యవతి విస్తుబోయి కళ్ళింత చేసుకొని మధ్యమధ్య ‘ఆఁ’ ‘ఊఁ’ అంటూ వింటోంది.

“తనుట నన్ను చాలా కాలంనుండీ ప్రేమిస్తున్నాట్ట! అనేకసార్లు సైగచేసినా నేను కనుక్కోలేదుట, నేను సరేనంటే, విషం తాగి చావమన్నా చస్తాట్ట. ఒప్పుకొంటే, ఏ కాశ్మీరమో తీసుకెడతాట్ట. బిచాణా యెత్తెయ్యమన్నాడు. సూరమ్మ చెప్పిందాకా తను ధైర్యంచేయలేకపోయాట్ట. నన్ను ఎద్దుమొద్దు స్వరూపమన్నాడు ప్రభాకరం” అన్నాడు శంకరం పగలబడి నవ్వుతూ.

"ఎందుకనిట ?" అన్నది సత్యవతి

"వాడు ఏడాదినుంచీ సైగలుచేస్తున్నా, పాడుతున్నా, ఈలలు వేసినా నేను గమనించకపోతే వాడేమనుకుంటాడు చెప్పుమరి! ఇలాగా కాస్సేపు వాగాడు. తరువాత నడుం చుట్టూ చెయ్యివేశాడు, లాగి తన్నాను. ఓ అరగంటసేపు యిద్దరం పెనుగులాడుకొన్నాం. ఆఖరికి వాడి గొంతు గట్టిగా నులిమాను. కళ్లు మూతలుపడేట్లు మొఖంమీద చరిచాను. వెళ్ళిపోయాడు ఆ కుమ్ములాటలోనే జాకెట్ చినిగిపోయింది. చీరె సగభాగం మధ్యాహ్నమే వూడిందనుకో, మిగతాది వాడు పుణ్యంకట్టుకొన్నాడు. లుంగీ కడదామంటే ఆడది లుంగీ కట్టుకోగూడదాయె. చీర కట్టుకోడం చేతకాదాయె! మరి చావనా? "అన్నాడు శంకరం నవ్వి.

"మంచిపని చేశావ!" అన్నది సత్యవతి.

"నువ్వేలా నెగ్గుకొచ్చావమ్మా!" అన్నాడు శంకరం సిగరెట్ వెలిగిస్తూ. "ఇవ్వాళ ఆఫీసులో నువ్వు సిగరెట్ కాల్చావా ?"

"ఒక్కసారి కాల్చాను, గొంతుకా మండిపోయి చాలా సేపు దగ్గాను" అన్నది సత్యవతి.

"గొడవేమీ జరగలేదు గదా ?" అన్నాడు శంకరం.

సత్యవతి అన్ని సంగతులూ చెప్పింది. శంకరం ముఖం వాడిపోయింది.

"చాలాపాడుపని చేశావ్. ఆ తేనెతుట్టెను నిన్న వరు కదిలించమన్నారు సత్యా! రేపు వీళ్ళందరూ నేను చెప్పినట్లు వింటారా? కృష్ణమూర్తికి వుద్యోగ మిస్తానని

నేను మాటిచ్చాను గదా ! నువ్వు మరోలా రిపోర్టు రాస్తే రేపు నే నేంగావాలో చెప్పు ? ఈ సంతకా లెందుకు ? క్రైం నోట్ చెయ్యడ మెందుకు ? వెంకటరత్నంగాడిమీద రిపోర్టెందుకు ? మొత్తానికి ఒక్కరోజులో నానా రభసా చేశానంటావ్ ?" అని విసుక్కొన్నాడు శంకరం.

"మీరుమాత్రం తక్కువ చేసిందేముందీ ? సూరమ్మతో లాలూచీపడితిరి. ఆ ప్రభాకరంగాణ్ణి కొంపలోకి రప్పిస్తిరి. రేపు మీ్రరింట్లో లేనప్పుడు వాడు తిరిగి జొరబడితే నా గతేం కావాలో మీరు చెప్పండి మరి ?" అన్నది సత్యవతి రోషంగా.

శంకరం తల గోక్కున్నాడు. చాలాసేపు మబ్బుల కేసి చూసి హఠాత్తుగా సత్యవతివైపు తిరిగి సన్నగా నవ్వుతూ "సుమతిని కదిపిచూశావా" అన్నాడు.

సత్యవతి ప్రాణం బిక్కచచ్చిపోయింది.

"మీకు ప్రభాకరం చేసిన పనే, నాకు సుమతి చేసింది."

"రేపెలా ఆవిడముందు తలెత్తుకతిరగడం ? అన్నాడు శంకరం విచారంగా.

"ఎందుకయినా మంచిదని నాకు వొంట్లో బాగో లేదన్న వాదు పుట్టించాను. ఆ సుస్త్రీలోవుండి చేసిన పొరపాట్లకు యెవ్వరూ బాధ్యులుకారు. మనస్సు మనస్సులో లేదు. అందుకనే అందర్నీ గట్టిగా కూకలేశాను. ఇస్తానన్న వుద్యోగం యింకోని కిచ్చారు, మంజూరు చెయ్యాల్సిన లైసెన్సుల్ని కాన్సిల్ చేశారు. భగవంతుడి దయవల్ల మళ్ళీ

రేపటికల్లా మనం మామూలువాళ్ళమయిపోయామనుకోండి, ఈ గొడవల్ని సులభంగా సర్దుకోగలం, ఏం?" అన్నది సత్యవతి.

"శంకరంగా నువ్వు సుఖంగా లేవా" అన్నాడు శంకరం.

"నా బొంద సుఖం! దొంగలమధ్య బ్రతికాలి. ఇష్టం లేని పనులు చెయ్యాలి అందరికీ వొడిగి వొడిగి వుండాలి. లేనిపోని దిక్కుమాలిన లాంఛనాలన్నీ పాటించాలి. న్యాయం కాదని తెలిసికూడా ఓ పాడుపని చెయ్యాలి. రేపెప్పుడన్నా పీకలమీది కొస్తే బాధ్యత మీదే! అప్పుడీ పని చేసినందుకు పనిష్మెంటిస్తే యిప్పుడు చెయ్యనందు కిస్తారు. ఏ గంగలో దూకేటట్టుండీ?" అన్నది సత్యవతి.

"కాబట్టి నేనేదో సుఖపడిపోతున్నానని నువ్వనుకోవడంలో బొత్తిగా అర్థంలేనట్టేగా?" అన్నాడు శంకరం.

"అబ్బ! పోదురూ! ప్రతిదాన్ని అలా సాగదీసి, నా ప్రాణాలు తోడెయ్యకండి!" అన్నది సత్యవతి బుంగ మూతిపెట్టి, భుజాలు అటూ యిటూ వూపుతూ గోముగా.

శంకరం గట్టిగా నవ్వేశాడు.

"నువ్వింకా శంకరానివేనోయి పిల్లా! అలా ఆడవాళ్లు గారాబంపోతే బావుంటుందిగానీ, మగాడు బుంగమూతి పెడితే పరమ ఛండాలంగా వుంటుంది" అన్నాడు శంకరం.

ఏమో బాబూ! ఒక్కరోజుతో యేడాదిజీవితం అనుభవించాననిపిస్తోంది. ఖ్వాహిహూ అల్లాగే అనుకుంటే యిక మనం అవతారాలు మార్చుకోవచ్చు" అన్నది సత్యవతి.

"సరే! నాకు నిద్దరొస్తోంది" అన్నాడు శంకరం

దొంగ ఆవలింత ఆవలిస్తూ, చేతులు చాపి మెటికలు విరుచుకొన్నాడు.

సత్యవ హాయిగా నవ్వింది.

" ఆవలింతల సంగతి నాకు తెలుసుగానండీ! మీరో విషయం మరచిపోతున్నారు. మీరు యిప్పటికి సత్యవతే! ఆవి డెప్పుడూ యిలా ఆవలించి యెదుటివారిని తొందర పెట్టదు" అన్నది సత్యవతి.

"పోనీ శంకరం తొందర పెట్టొచ్చుగా?" అన్నాడు శంకరం ఆవిడ ఆకారాన్ని చూసి మురుసుకొంటూ.

"అలా చెయ్యడానికి స్వభావం వొప్పుకోదు".

"మరెలా చానవు!" అన్నాడు శంకరం ఆమె కేసి మింగేస్తున్నవాడులా చూసి.

"మీరలానే వుండండి! నాకీ పూట వొంట్లో బావుండలేదు... అరే! చెప్పేది మీకే! ముందు మీ రక్కణ్ణించి చెయ్యి తియ్యాలి!" అన్నది సత్యవతి చెయ్యి తీసేసే ప్రయత్న మేమీ చెయ్యకుండానే.

శంకరం పిచ్చివాడయిపోవడానికి ఒక్కమాట చాలు. అతను అలవాటు ప్రకారం భార్యను దగ్గరకు తీసుకొన్నాడు. భుజంమీదినుండి చేతిని కిందికి జార్చాడు. నల్లని వెంట్రుకలు వుంగరాలు తిరిగి దట్టంగా వేళ్ళకు తగిలాయి. అదే సమయాన తన కంఠంకింద సత్యవతి వేళ్ళు పాముపిల్లల్లా పాకాడుతున్నాయి. ఆమె కళ్ళల్లో మెరుపులు విరిశాయి. శంకరం ముఖాన్ని దగ్గరగా లాక్కొని పెదవులమీద గట్టిగా ముద్దుపెట్టుకొంది.

"నిన్ను నువ్వే ముద్దుపెట్టుకొన్నా వన్నమాట" అన్నాడు శంకరం మెల్లగా.

సత్యవతిఇంకేమీపలుకలేదు. ఆమె వెచ్చనిఊపిర్పులు, అతని చెంపలను కాల్చాయి. అతనుమాత్రం తక్కువ చేసిందేముంది గనుక? అతని మాట ప్రకారం, అతని నడుం చుట్టూ అతనే చేతులుచుట్టి, తనను తనే దగ్గరగా హత్తుకొన్నాడు.

*　　　*　　　*

"మహాప్రభో! ఏమిటిదంతా?" అన్నది అమ్మవారు.

శంకరుడు మందహాసం చేశాడు.

మనిషికీ మనిషికీ మధ్య, సత్సంబంధాలు నశించిపోతున్నాయి దేవీ! పరస్పరం అవగాహన మనేది లుప్తమయిపోతున్నది. ఈర్ష్యతో, ద్వేషంతో, అసహనంతో, మానవులు కుళ్ళిపోతున్నారు. తాము సుఖపడలేక పోయినందుకు విచారించడంకన్నా యెదుటివారు సుఖపడుతున్నందుకే యెక్కువ విచారిస్తున్నారు. జీవితాన్ని జీవితంగా చూపటం మరచిపోతున్నారు" అన్నాడు పరమేశ్వరుడు.

"పైకలా కనిపించడంలేదుగదా స్వామీ!" అన్నది అమ్మవారు.

"లేదు, అలా స్పష్టంగా కనిపిస్తున్నంతకాలం వారు హాయిగానే వున్నారు. పల్లించే మాటలకూ, ఆచరణకూ మధ్య యెప్పుడైతే అగాధాలు యేర్పడ్డాయో, అప్పటినుండీ బ్రతుకు దుర్భరం కాసాగింది. భౌతికంగా వారంటున్న వేవీ మానసికంగా అంగీకరించలేకపోతున్నారు. బహిర్జీవితమూ

అంతర్జీవితం రెండు పాయలుగా చీలిపోయాయి. పాయల మధ్యదూరం పెరిగినకొందికీ, బ్రతుకు విషాదమయంకాక తప్పదు. తనకు కానిదేదో యెదటివారనుభవిస్తున్నారన్న దుగ్ధ, మనశ్శాంతిని, ఆనందాన్ని జీవితంలోని రుచినీ సమూలంగా తుడిచిపెట్టేసింది. తన పరిధిలో, తను సుఖంగా వుండగలగడం మరిచిపోతున్నారు. అందుకే వారి నిలా మార్చాను" అన్నాడు పరమేశ్వరుడు చిరునవ్వు నవ్వుతూ.

"ఉదయానికల్లా మామూలు వ్యక్తులయిపోతారు గదా ?" అన్నది అమ్మవారు.

"అలా అయితే తప్ప, లేకపోతే యీమార్పువల్ల ప్రయోజన మేముంటుంది దేవీ! మనం పడిన శ్రమంతా అందుకోసమే !" అన్నాడు పరమేశ్వరుడు.

"వారిద్దరూ యిక సుఖంగా వుండగలరంటారా స్వామీ ?" అన్నది అమ్మవారు.

"అది దేవ రహస్యం, వేచిచూడు. ఇంతకన్నా ప్రస్తుతం నేనేమీ చెప్పను" అన్నాడు పరమేశ్వరుడు అమ్మవారిని క్రీగంట చూస్తూ.

సంపూర్ణం